శ్రీ

# తిక్కనసోమయాజివిజయము.

వేదము వేంకటరాయశాస్త్రి పరికలితము.

ప్రథమముద్రణము.



చెన్నపురి

కలారత్నాకరముద్రాక్షరశాలయందు

ముద్రితము.



1920-సం.



దీనివెల 8 అ.

# తిక్కనసోమయాజి విజయము.

## శోధన పత్త్రము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 30 | 23 | సంవే | సందే |
| 31 | 12 | చిత్ర | చిత్రి |
| | 15 | చిత్ర | చిత్రి |
| 32 | 4 | వైన | లైన |
| | 19 | వర్యంఁ | పర్యంఁ |
| 33 | 1 | వెంకట | వేంకట |
| 34 | 2 | అని | అని |
| 37 | 6,7 | కల్పనులు | కల్పనలు |
| | 7 | గాపు | గాపు ; |
| 39 | 1 | సోమున | సోముల |

ఈ వ్యాసమును విక్రమసింహపురి వర్ధమానసమాజమువారి కోరికమేరకు తత్సమ్ముఖమున్న వారసౌధములో 1919-సం. మే నెలలో, పఠించితిని. పిమ్మట దీనిని పుస్తకముగా ముద్రింపింపఁ దలంపుగొన్నవాఁడనై యుండఁగా, మన్మిత్రులు శ్రీయుత గునుపాటి యేనాదిరెడ్డిగారు ముద్రణవ్యయమును తా మొసంగ నుద్యుక్తులైరి. ఈ వృత్తాంతము విక్రమసింహపురీ వర్ధమాన సమాజమువారికి ఎఱుకపడఁగా వారు ఈ యుపన్యాసమును నాచేతం జేయించినవారు తాము గావున ముద్రణవ్యయమును తా మొసంగెద మని నాకుం దెలిపిరి. ఆసమయంబున ఏతదుపన్యాసస్వరూపమును శ్రీ యేనాదిరెడ్డిగారివలన విన్నవారై శ్రీయుతులు పాటూరి వేంకటకృష్ణయ్యగారు తిక్కన సోమయాజులవారి సంతతిలో 17-వ తరమువారు అత్యంతోత్సాహముతో ఆగ్రంథమును తామే ముద్రింపఁ గోరినవారై శ్రీరెడ్డిగారిచేత నాకుం దెలిపి ముద్రణారంభ పర్యాప్తముగా ధనమును నాకుం బంపి, శేషము ఎంతయైనను, ఇంత యని తెలిపినం బంపెద మని జాబు వ్రాసిరి. ఏకవిబ్రహ్మ కుపాసనగా ఈగ్రంథము ఈమాణవకునిచేత రచియింపఁబడినదో, పూర్వోక్తరసజ్ఞు లెల్ల యదుపాసనాంగముగా ఈగ్రంథమునకు ముద్రణవ్యయ మొసంగ దొరకొనిరో, తదీయ వంశ్యప్రముఖుల తత్పూజేప్సితమును నెఱవేర్చుట ఆయుపాసనకు శాశ్వతప్రతిష్ఠ. యగుటగా భాషాదేవతాభిమతము గావున నీజేప్సితాతిక్రమమునకు నన్ను మన్నింపుఁ డని శ్రీరెడ్డిగారిని వారివాక్కుచేత శ్రీవర్ధమానసమాజము వారిని వేఁడి, శ్రీవేంకటకృష్ణయ్యగారి మనోరథమును గూడ పూజారిన్యాయంబున నెఱవేర్చినాఁడను.

నిజవంశమూల మయిన కవిబ్రహ్మయొక్క మహిమఖ్యాపనకై యిట్లు అఖండితోత్సాహము వహించిన యీమహనీయుని గుణాతిశయములనుం గూడ పండితపరిలో పార్థమై గ్రంథస్థము సేయ వలదా యనిన—వానిని శ్రీయుతులు పాటూరి యాదినారాయణయ్యగారు నాకుం దెలిపియున్న యమృతప్రాయఘటికి యుండఁ, నాయెరవు వాక్కులం దెలుప సమకట్టక వారి యా యమృతఘటికచేతనే యిందు నెలకొల్పినాఁడను. దానితో శ్రీవేంకటకృష్ణయ్యగారి జాబును తిక్కనయాదిగా తదీయ వంశావళినిగూడ విద్వత్సంతుష్ట్యర్థము ఇందుం బ్రకటించినాఁడను.

## బ్రహ్మశ్రీ శ్రీ శాస్త్రులవారి సమ్ముఖమునకు.

నమస్కృతులు. అయ్యా! నేను శ్రీతిక్కనసోమయాజులవారి వంశజాతుఁడను. తాము రచియించిన శ్రీతిక్కయజ్వగారి జీవితమును ముద్రింపించుట కగు వ్యయము నొసంగుటకు నుత్సహించిన మావంశతల్లజుండగు శ్రీవేంకటకృష్ణయమంత్రిగారి చరిత్ర నించుక దెలుపుకొనుచున్నాఁడ.

వేంకటకృష్ణయమంత్రిగారు శ్రీ సోమయాజులవారికి—పదియేడవతరమువారు. మూఁడుతరములుగా మావంగడమునకు మానికముగా, నానాఁట అభివృద్ధినొంది, ప్రస్తుతము ఇందుకూరుపేటలో మావంగడపు వారిలోను తదితరు లగు గ్రామస్థులలోను మిన్నయైన కుటుంబముగలవారై, అన్నివిషయములయందును, సంపూర్ణ

సమృద్ధి గలిగియున్నారు. అన్నదానవిషయమున వీరిని జెప్పినచోట మరియొకరిని జెప్పనట పాటి గాదు. అనఁగా—అహర్నిశమును, ఎంతమంది యతిథు లేతెంచినను, విసుగు లేక కడుభక్తితో వలయు భోజ్యంబు లిడి తుష్టులం గావించుచుండెడివారు. వీరికిఁగల ముఖ్యబిరుద మిదియే, (అన్నదాత లని).—

ఆంధ్రదేశకవిప్రకాండుల వంశములకన్న మిన్నయైన శ్రీతిక్కయజ్వగారి కుటుంబము వారితరమునుండి తామరతంపరయై పెనగొని నేఁటివఱకు వ్రాయఁబడుచు వచ్చిన వంశవృక్షము వీరియొద్దఁ గలదు. ఇందు విశేష మేమన, ఎచటను సుకవుల వంశములు ఎక్కువవృద్ధిమంతములై యుండుట సహజముగాఁ గాన్పింపదు; మావంశ మన్ననో, శ్రీవారికి మేము పదియేడవతరము వార మయినను ఇప్పటివఱకు ఈ సద్వంశమున మాకు ముందుతరములవారిలోఁ గాని మాతరమువారిలో గాని, శ్రీవారి వంశజులమే యని చెప్పకయే తెలిసికొనఁజేయు ప్రయోజకులు లేకున్నను, (శ్రీ సోమయాజులవారు, గోత్రాభివృద్ధికొఱకు వరముం బడసిరని మాపెద్దలు పరంపరగా చెప్పచుండెడి వాడుక ప్రకారము) వారి కృపాకటాక్షాతిరేకంబున నేఁటివఱకు వంశము మాత్రము అత్యంతముగా వర్థిల్లుచున్నది. శ్రీవేంకటకృష్ణయమంత్రిగారు, అయిదు సంవత్సరములనుండి, నెల్లూరుతాలూకాబోర్డు మెంబరుగా నున్నారు, ఈగ్రామ (ఇందుకూరుపేట) యూనియనుచైర్మనుగాఁ గూడ నున్నారు. వీరు గవర్నమెంటు వారికి రూ. 2500 లు. సిస్తు చెల్లించెదరు. ఇట్లు, విన్నవించు

కొత్తూరు, 1—2—1920.

పాటూరు - ఆదినారాయణయ్య
కరణము, ఇందుకూరుపేట, నెల్లూరు.

బ్రహ్మశ్రీ వేదము - వేంకటరాయ శాస్త్రిలవారికి.

పాటూరు వేంకటకృష్ణయ్యకృతానేక నమస్కారములు—తాము రచించిన శ్రీ తిక్కనసోమయాజులవారి జీవితమును ముద్రించుటకు తద్వంశజులము మేము తామర తంపరగా నభివృద్ధి నొంది యుండఁగా తదితరుల సాహాయ్యమున నది ప్రకటింపఁబడుట సమంజసము గానిదిగా నెంచి, అందుల కగు వ్యయమును సంపూర్ణముగ నొసంగం గోరిక్కొని యేఁబది రూప్యములను మాత్రము ప్రస్తుతము పోస్టుముఖముగాఁ బంపుకొంటిని. ఆవంగడపువారమగుమాకు వారిజీవితమునుగుఱించి ముఖ్యముగా తెలిసియుండవలసినదే, యయ్యును, అందుల కెంతయు బయటివారముగా నుంటిమి.—అందులకై కడుంగడు వ్యయప్రయాసల కోర్చి గుంటూరివారితో సంవదించి, శ్రీవారు నెల్లూరివారే యని, సిద్ధాంతముచేసి, తజ్జీవిత గ్రంథమునకు వలసిన కథాంశములను బూర్ణముగ సంపాదించి వ్రాసి, ఆంధ్రదేశవాసుల నెల్లర నత్యంతామోదాంబునిధి నోలలాడించి కీర్తి గడించిన తము కెంతయు కృతజ్ఞుఁడ. ముద్రణవిషయమునకు ఇంకను వలసినధన మెంత యైనను తెలియఁజేసిన, వెంటనే పంపుచున్నాఁడ. ఇంతియ నమస్కారములు. ఇట్లు,

ఇందుకూరుపేట, 1—2—1920. పాటూరు వేంకటకృష్ణయ్య.

# శ్రీ పాటూరి వేంకట కృష్ణయ్యగారి వంశము.

1 తిక్కనసోమయాజి.

2 కొమ్మనమంత్రి.

3 హరిహరామాత్యుడు.

4 కొమ్మనమంత్రి.

5 రామనమంత్రి. — తిప్పనమంత్రి.

6 సోమనమంత్రి.

7 వీరనమంత్రి.

8 సోమలింగమంత్రి.

9 సోమరాజమంత్రి.

10 పాపనమంత్రి.

11 వీరనమంత్రి.

12 గోపాలమంత్రి. — భద్రార్యమంత్రి. — నరసింహమంత్రి.

13 వీరనమంత్రి. — అప్పనమంత్రి. — తిక్కనమంత్రి — భద్రార్యమంత్రి.

14 భద్రయమంత్రి — లక్ష్మీనరసింహమంత్రి — నరసింహమంత్రి

15 రామభద్రార్యమంత్రి

16 లక్ష్మీనరసింహమంత్రి — భద్రయమంత్రి — పిచ్చయమంత్రి

17 సుబ్బరామయమంత్రి — వేంకటకృష్ణయమంత్రి — రామచంద్రయమంత్రి — ఆదినారాయణమంత్రి — లక్ష్మీనరసింహమంత్రి — సుబ్రహ్మణ్యమంత్రి

ఈవంశావళి రెండు చాటుపద్యములుగాఁ గూడ ప్రసిద్ధి కెక్కియున్నది.—

సీ. భారతపర్వముల్ పదియేను వరుసగాఁ । దెనిఁగించె గుంటూరితిక్కయజ్వ,
అమ్మహాత్ముని పుత్త్రుఁ డా కొమ్మనఘనుండు । కల్పించెఁ బాటూరికరణికంబు,
ఆకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు । నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు,
రహిమీఱ నతనికి రామన తిప్పన, । యారామనకు సోమయాహ్వయుండు,
ఆ. ఆఘనునకు వీరనామాత్యుఁ, డతనికి । సోమలింగమంత్రి, యామహాత్ము
నకును సోమరాజనాముఁడుఁ జిటిపిర । ఘనుఁ డనంగ సుతులు గలిగి రంత.
సీ. సోమనకును గల్గె సుతుఁడు పాపనమంత్రి, । యతనికి పిరన, యాఘనునకుఁ
గూరిమితనయులు గోపాల భద్రార్య । నరసింహమంత్రు లనంగ ముగురు,
వారిలో నరసింహవరునకు శరభార్య । భాస్కరామాత్యులు నారసింహ
ఘనుఁ డనఁ బుత్త్రులు గలిగిరి మువ్వురు, । వారిలో శరభార్యవర్యునకును
ఆ. వీరఘనుఁడు గలిగె, వేడ్క నామంత్రికి । శరభమంత్రివరుఁడు జనన మొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలో దీన । కులము వర్ధిలంగఁ గొమరుమీఱి.

ఇందలి ప్రథమచాటువులో తిక్కయజ్వ గుంటూరితిక్కయజ్వ యని వ్యవహృతుఁడు. స్వయము నెల్లూర మంత్రిగా నుండి మనుమసిద్ధికి బోయినరాజ్యమును వెండియు సంపాదించి యిచ్చినను, తండ్రితాతలు నెల్లూరిరాజులకు కులమంత్రులై యుండినను, ఈయనను నెల్లూరివానింగా చెప్పక ఈచాటుకవి గుంటూరివానింగా చెప్పుటకు కత మరయవలయును. అట్లే మడికిసింగన తిక్కనపౌత్త్రిని గుంటూరివానింగాఁ జెప్పుటయు, విమర్శనీయము. సింగన జ్ఞానవాసిష్ఠ పద్యభాగము—

సీ. అతఁడు దిక్కనసోమయాజుల పౌత్త్రుఁ డై । కొమరారు గుంటూరి కొమ్మవిభుని
పుత్త్రిఁ బట్టాంబిక బుధలోకకల్పక । వల్లి వివాహమై వైభవమున.—

తిక్కనసంతతిలో కొమ్మన యని తత్పుత్త్రుఁడును ప్రపౌత్త్రుడునుం గలరు. పౌత్త్రుఁడు హరిహరామాత్యుఁడు.—ఇట్టి యీప్రయోగములం బరిశీలింపఁగా— తిక్కనపూర్వులు నెల్లూరిరాజులకు గుంటూర దండనాథు లై యుండిన విశేషముం బట్టి గుంటూరుశబ్దము తిక్కనవంశ్యులకు కొంతకాలము ఇంటిపేరుగా వ్యవహృత మగుచుండె నని తోఁచుచున్నది. అటు కాదేని తిక్కనకుం బుత్త్రుఁడో ప్రపౌత్త్రుఁడో యగునీకొమ్మనామాత్యుఁడు కూడ తిక్కనతండ్రివలెనే గుంటూర దండనాథుండుగా నుండె నని యేని యూహింపఁ దగును. ఈగ్రంథములోని యారంభఘట్టముననే యీనెల్లూరు గుంటూరు వాదము పరిష్కృత మగును.

మదరాసు,<br>ఏప్రిల్, 1920.

వేదము - వేంకటరాయశాస్త్రి.

మఱియు.—

గడచిన (1919) మేనెలలో నేను నెల్లూరిపౌరసౌధమున తిక్కనసోమయాజి జీవితముంగూర్చి యీయుపన్యాసమును అముద్రితమును పఠించితిని. అచటనే సుమారు నెలతర్వాత ఆంధ్రసాహిత్య పరిషత్సమావేశమున శ్రీమాన్ మాడభూషినరసింహాచార్యులు బి. ఏ., బి. ఎల్. గారును తిక్కనజీవితముంగూర్చియే యొకయుపన్యాసముం బఠించిరి. ఈరెంటను 'తిక్కన నెల్లూరివాస్తవ్యుఁడేగాని గుంటూరివాస్తవ్యుఁడు గాఁడు' అనుసిద్ధాంతము సప్రమాణము అపూర్వము కలదు.

శ్రీనరసింహాచార్యులవారి యుపన్యాసము పరిషత్పత్రికలో కొన్ని దినముల క్రిందట ప్రకటితము. మదీయోపన్యాసము ఏతద్గ్రంథరూపమున ఇప్పుడు ప్రకటితము. నాకు మూఁడుమాసములనుండి బెట్టిద మయిన నేత్రామయము కలుగుడు, ఇందుల ప్రూఫులను ఒక బి. ఏ. విద్యార్థి వ్రాఁతప్రతిని బట్టి దిద్దుటయు, ఆప్రతిని తత్సహాధ్యాయులు చదువుటయు, వారిలో నాకుం బ్రసన్నులు కానివారు శ్రీనరసింహాచార్యవ్యాసమును బఠించినవారు దానినుండి పూర్వోక్త సిద్ధాంత ఘట్టమును నేను స్వీకరించితి నని వాదించుటయుఁగలిగెను. అంతట నామిత్రులు నావలన ఆవిద్యార్థుల మాట పొల్లని యెఱింగిరి. శ్రీమదాచార్యులవారి యుపన్యాసమును నేను వినకముందే కనకముందే పూర్వోక్త సిద్ధాంతఘట్టమును నెల్లూరి పౌరసౌధమున నాగ్రంథమున ఇప్పుడున్న తీరుననే నేను పఠించినందులకు నాయుపన్యాసము నవధరించినసభ్యులు అందు ప్రధానముగా శ్రీనరసింహాచార్యులవారు పూఁట.

ఇది గాక, మదీయగ్రంథమును శ్రీనరసింహాచార్యులవారు మత్పఠనానంతరము ఆసభలోనే నన్నడిగి పుచ్చుకొని తమయుపన్యాసపఠనమునకు ముందు సుమారు ఒకమాసంబును అనంతరము సుమారు ఒకమాసమును ఉంచుకొనియుండిరి. కైకొను నప్పుడు వారు పలికిన ప్రకారము ఆమఱునాఁడే నావ్యాసమును నాకు వారు ఇచ్చియుండినచో, అదియే ముందు ముద్రితమై వెలువడియుండును.

ఇంతియగాని, శ్రీనరసింహాచార్యులవా రెఱింగిన విషయములను నారు గోచరింపనివానిని నే నేల వారివలన గ్రహింపఁగూడదు? విశ్వాసముతో గ్రహించియందులకై కృతజ్ఞత నేల తెలుపఁగూడదు? వారు మదీయ విక్రమసింహపురీ మిత్రవరేణ్యులలో నన్యతములు. అట్టిమైత్రి మాకు బహుకాలమునుండియు జరుగుచున్నది. అందులకు వారు నిర్విశంకముగా నాగ్రంథమును సభలో అడిగి కైకొనుటయే తార్కాణము. వారిమైత్రిచేత నేను కడుం గృతార్థుఁడను.

వే-వేం.

# తిక్కనసోమయాజివిజయము విషయసూచి.

విషయము. పుట.

# శ్రీ
# తిక్కనసోమయాజి విజయము.



[ఈవ్యాసము ప్రాయికముగా కేతన దశకుమారచరిత్రమునుబట్టి, లిఖితము.]

## ౧. తిక్కన ఎవరు? ఎక్కడివాఁడు? అతనికాల మేది ?

తిక్కన బ్రాహ్మణుఁడు గౌతమగోత్రుఁడు. అమాత్యవంశమువాఁ డగుటచేత నియోగి కావలయును. అతనితండ్రి కొమ్మనదండనాథుఁడు, తల్లి అన్నమ్మ, ఇంటిపేరు కొట్టరువువారు. "కొట్టరువు తిక్కనికిన్" 1 (4), "కొట్టరు మంత్రి తిక్కనిన్" 1 (8), "కొట్టరు కొమ్మశౌరి" 1 (81), "కొట్టరువు కొమ్మనామాత్యమూర్తి సుతుఁడు...తిక్కశౌరి" 1 (88), "కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానం బగు విక్రమసింహపురంబు వర్ణించెద" 1 (10).

౨. తిక్కన విక్రమసింహపురీ (=నెల్లూరు) వాస్తవ్యుఁ డని పైయుద్ధారమునసే తెలిసినది గదా. విక్రమసింహపురి యన నెల్లూరా యనియు ప్రశ్న వచ్చినది. నెల్లూరే యనుటకుం బ్రమాణములు—శ్రీనాథుఁడు శృంగారనైషధములో కృతినాయకునిముత్తాతను "చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసి యై" అని నామైకదేశగ్రహణన్యాయంబున విక్రమసింహపురీవాసి యని 1 (20) వచించి, గ్రంథాంతమున "నెల్లూరి తూర్పురాజపౌత్త్రి మామిడిపెద్దనామాత్యపుత్త్రి)...సింగనామాత్య" అని ముగించినాఁడు.....జక్కన విక్రమార్కచరిత్రమున ఒకకథలో "సిరుల నొప్పారు విక్రమసింహపురము" 7 (133), అని నిర్దేశించి - ఆపురంబున "నెగడెడు పినాకినీతటినీవధూటి, పట్టణాంతరసీమఁ జూపట్టుటయును." 7 (39) అని యందుం బెన్న పాఱుటం జెప్పి, పురమును వర్ణించినాఁడు 7 (141). పూర్వము పెన్న నెల్లూర నిప్పటిరంగనాయకులపేటకు దక్షిణమున తూర్పుమొగముగాఁ బాఱుచుండినది....ఇదియునుంగాక దేవళములు లోనగుస్థలములం గల శాసనములచేత విక్రమసింహపుర మన నెల్లూరే యని నిశ్చయము. ఈక్రిందితావుల నుండునట్టి శాసనములను పరికింపుఁడు:—నెల్లూరుజిల్లాలో గూడూరుతాలూకాలో (1) కుఱుచెర్లపాడు—"జయంకొణ్డ శోయమణ్డలత్తు చ్చేదికులమాణిక్కవలనాట్టు ప్పడైనాట్టు నెల్లూరాన విక్కిరమశింగపురత్తు..." అని శాసనభాగము. ఇట్లే (2) పుంజులూరుపాడు, (3) వీరన్నకనుపూరు, (4) మల్లాము సుబ్రహ్మణ్యస్వామ్యాలయము—

అనుతావుల శాసనములందు పైవాక్యభాగము కలదు. (5) కోవూరిలోను ఇట్టి దొక శాసనము కలదు. (6) రామతీర్థమందును ఒకటి కలదు. ఇట్లన్వేషించుటలో చంక నున్న మేకపిల్లను ఊరనెల్ల వెదకినపామెతగా ఈవాక్యభాగముగలశాసనములు నెల్లూరనే శ్రీరంగనాయకస్వామియాలయకుడ్యములయందు 11ను, నెల్లూరనే కడమకొన్నితావుల 4 ను, దొరకినవి. వీనియందు ఆయాకైంకర్యములు ఏయేస్వామికి చేయఁబడినవో వారివారిపేరులునుం గలవు. శ్రీతల్పగిరి రంగనాయకస్వామి కైంకర్యప్రఖ్యాపకము లయినపైశాసనములయందు "నెల్లూరాన విక్కిరమ సింగప్పురత్తు పార్కడత్తు...పల్లికొండపెరుమాళుక్కు" అని యిట్లు గలదు. ఈశాసనములను నెల్లూరి శాసనపుస్తకత్రయములో—గూడూరుతాలూకా-౧—431, 440, 460; కోవూరు-౨—808; నెల్లూరి శ్రీరంగనాయకస్వామిగుడి 830, 831, 832, 833, 834, 837 (రెండు), 839, 840, 842, 843, 845, 848; నెల్లూరనే ఇతరస్థలముల 852, 853 (రెండు), 855; రామతీర్థము-864—పుటలలోఁ గనవచ్చును....

ఈ క్రిందిపద్యముంగూడఁ జిత్తగింపుఁడు:—బిట్రగుంటదానశాసనము:—

"పాకాఖ్యో విషయోఽస్త్యపారమహిమా ప్రాచః పయోధేస్తటే,
తస్మిన్ విక్రమసింహమిత్యపి పురం ధత్తే ఽలామ్రశ్రియమ్,
తస్యాప్యుత్తరత స్త్రియోజనమితాద్దేశాత్ స్ఫురత్త్యుజ్జ్వలో,
గ్రామో బిట్టరగుణ్ట ఇత్యముమదా ద్రాజా గురోః ప్రీతయే."

ప్రా. లే. మా. 3—73 పు.

[ఇటదాత శ్రీవీరబుక్కమహారాజ భ్రాతృజ శ్రీసఙ్గమమహారాజు. ఈకవనము చేసినవాఁడు అతనినర్మసచివుఁడు, పరాశరస్మృతి వ్యాఖ్యాతృ శ్రీమాధవాచార్యుని సోదరుఁడు భోగనాథుఁడు.]

3. తిక్కన భారవి భోజ మయూరులకు అర్వాచీనుఁడు, (క్రీ. శ. 1275). "భారవికల్ప" 9 (85), "ఆర్యభోజుండు" 2 (20), "మయూరసన్నిభమహాకవి" 1 (6).

## ర. అతని జీవిక యేమి ?

తిక్కన నెల్లూరి మనుమసిద్ధిరాజునకు కులమంత్రి. "విక్రమసింహపురంబున కధీశ్వరుండును 1 (12)......కీర్తిపాత్రం బైన మనుమసిద్ధి మహీవల్లభునకుం గరుణాపాత్రం బైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకులక్రమాగతం బగు మంత్రిపదంబున వర్తిల్లుచు." 1 (20).

ఈతనితండ్రియుం దాతయు నిజజ్యేష్ఠులు నెల్లూర మంత్రులుగా నుండఁగా తాము గుంటూరిని దండనాథులుగా నేలుచుండి రని వక్ష్యమాణమున స్పష్టపడును.

౫. తిక్కనకు దొర యైనమనుమసిద్ధి శా. శ. 1179 - 1182 సం.—అనఁగా క్రీ. శ. 1257 - 1260 లో కృష్ణామండలములో భూదానములు చేసినట్లు శాసనములు దొరకియున్నది. అందువలన నెల్లూరు రాజధానిగా నతనిరాజ్యము కృష్ణవఱకు వ్యాపించి యుండె నని తెలియ నగుచున్నది. కావున ఆతనిదండనాథులు గుంటూర విభులై యుండుట ప్రాసంగియున్నది.

౬. అతని పూర్వుల గొప్పతనము:—

కవులు రాజామాత్యులై ననియోగిబ్రాహ్మణులయందు క్షత్రియవీరోచితము లయిన బల నీతి పరాక్రమ వైరిజయ శస్త్రాస్త్ర ప్రయోగ ప్రావీణ్యాది గుణవిశేషము లెల్లను, విప్రోచితము లైన వేదాది విద్యాధనత్వ కర్తృత్వాది ప్రభావముం గూడను, వర్ణింతురు. అట్లే ఆంధ్ర దశకుమార చరిత్రములో కేతనయు తిక్కన పూర్వులయందును తిక్కనయందును ఉభయమహిమలను వర్ణించినాఁడు:—

కేతయ భాస్కరుని నీతి దాన ప్రతాపములు 1 (39),

బాచయమారశౌరి రూపవిక్రమములు 1 (42),

గుండయమల్లని సురూపవైభవ శౌర్యదానములు 1 (47),

గుండయసిద్ధని సత్య త్యాగ శౌచ శౌర్య సౌందర్యములు 1 (49),

తిక్కన పెదతండ్రులలో నొకఁడైనమల్లనామాత్యుని బలప్రతాపములు1(57),

ఆతనిసుతుఁ డగు మనుమసిద్ధిసౌందర్య రాజసేతులు 1 (60),

తిక్కనకు మఱియొక పెదతండ్రి యైన సిద్ధనామాత్యుని నృపనీతి 1 (62, 63). ఆయన మఱియు నిట్లు వర్ణితుఁడు:—

ఉ. స్థాపిత సూర్యవంశ వసుధాపతి నాఁ, బరతత్త్వధూత వా
జీపతి నా, నుదాత్త నృపనీతి బృహస్పతి నా, గృహస్థ గౌ
రీపతి నాఁ, గృపారస సరిత్పతి నాఁ, బొగ డొందె సిద్ధసే
నాపతి చోడతిక్కజననాథశిఖామణి కాప్త మంత్రి యై. 1 (62)

[ఈ చోడతిక్కరాజు మనుమసిద్ధికి తండ్రి.]

సిద్ధనభాస్కరుని శత్రుజయము 1 (64),

సిద్ధనమల్లని ప్రతిమల్లజయము 1 (64),

సిద్ధనపిన్నభాస్కరుని నీతివిక్రమములు 1 (64),

సిద్ధయతిక్కని దాన ప్రతాప శరణాగతరక్షణ సత్య 'గంధవారణ' బిరుదములు 1 (66),

జానమసిద్ధని రూపత్యాగ కృపా వృత్తములు 1 (70),

జానమకొమ్మని దానరూప వీర్య ప్రతాప సత్త్వములు 1 (71).

జానమముమ్మడి త్యాగ శౌర్యములు 1 (73),

తిక్కనసెదతండ్రి సిద్ధనకుమారుఁ డగుమంత్రిభాస్కరుని కాంతి ధీరతావిక్రమత్యాగములు 1 (75),

అతనితమ్ముఁ డగు కేతన నీతి యుద్ధవిజిగీషలు 1 (76),

అతనితమ్ముఁ డగు మల్లన నీతిప్రభావము. 1 (77)

అతనితమ్ముఁ డగు చౌహత్తనారాయణుని శస్త్రాస్త్రవిద్యాశ్లాఘ 1 (78),

సిద్ధనబాచని శత్రుజయము 1 (79),

తిక్కనసోమయాజితండ్రి యగు కొమ్మనామాత్యుని శౌచ శౌర్య భోగమానరూప దాన ధైర్య సత్యములు 1 (81).

౭. అయన "సూర్యవంశమహీపాల సుచిరరాజ్యావన సంతుండు" 1 (81) అనియు వర్ణితుఁడు. ఇతఁడు గుంటూరివిభుఁడుగ నుండి పిమ్మట మనుమసిద్ధి యాస్థానమంత్రి యాయె నని తోఁచుచున్నది. ఇతనిని విరాటపర్వారంభమందు తిక్కన యీతీరున వర్ణించినాఁడు:—

సీ. "మజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర। మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన। మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ। మ్మనదండనాథుఁడు మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్రప। విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయప్రణామంబు లాదరించి
తుష్టి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యొలమి నిట్లని యానతి యొచ్చె నాకు."

మత్సంకలితము లైనయాప్రమాణములచేత నిర్వచనోత్తర రామాయణము నుపోద్ఘాతము నందలిది—"తిక్కనవంశమువారు తొలుతఁ గృష్ణాతీరదేశమునందలి వెలటూ రనుగ్రామమున నుండినవారనియుఁ, బిదప నుద్యోగధర్మముచేత గుంటూరికిఁ బోయి చేరి రనియుఁ, దరువాతఁ గొండొకకాలమునకుం దిక్కన సోమయాజితండ్రి యగుకొమ్మనామాత్యుఁడు నెల్లూరుపురంబున ధర్మదారం బాణిగ్రహణంబుచేసియా

బంధుత్వంబున నెల్లూరికి రాకపోకలు సేయుచుండె ననియు, నాదంపతుల కుదయించిన తిక్కన మనుమజనపాలునాస్థానంబున నమాత్యుఁడును బండితాగ్రగణ్యుఁడునై ప్రసిద్ధి వడసి కొన్నాళ్ళకు జన్నమొనర్చి" అను నీవ్రాఁత విచారణీయ మగుచున్నది.

౮. తిక్కనయందు సేనానాయకత్వము "తిక్కదండాధీశుఁ" 7 (1), "తిక్కచమూపా" 9 (1), "తిక్కదండాధీశా" 12 (1), అని వర్ణితము.

౯. తిక్కనామాత్యుని రాజచిహ్నములు ఇట్లు పరిగణితములు:—

ఆ. " అందలంబు, గొడుగు, నడపంబు, మేలుకట్టు,
చామరములు జమిలి శంఖములును,
గంబగట్లు, భూమి, కానిక గాఁగఁ బెం
పెసఁగు రాచపదము లెల్లఁ బడసె." 1 (21)

సంవాదమునకై ధర్మరాజు చతుర్థజాతివతంసునకు ఇంద్రసేనరాజునకు ఇచ్చిన యీక్రిందిరాచపదముల నరయుఁడు.—

"ప్రీతః శ్వేతాతపత్రం, కనకవిరచితం దణ్డ మాఖణ్డలాభో
వ్యోమ్ని క్షౌమం వితానం, సకలనృపజనప్రార్థ్యసింహాసనార్థమ్,
నానావాదిత్ర శఙ్ఖధ్వనిభి రభినుతాం మఙ్గళాలత్తి (ప్తి?) కాం చ,
ప్రాదాద్ధర్మాత్మజో ఽస్మాత్ (స్మై ?) తుహినరుచిసితే చామరే చారురూపే."
ప్రా. తే. మా. 3 (25.)

"శ్వేతాతపత్త్రైకశఙ్ఖ పఞ్చమహాశబ్దాదీని కులక్రమాగతాని నిక్షిప్తానీవ సామ్రాజ్యచిహ్నాని సమాదాయ." ప్రా. తే. మా. 3 (33)

"రాచపదములం బడసి తిక్కన రాజ్యసుఖంబు లనుభవించుచు" 1 (22).

౧౦. ఇతనిప్రతాపము—"అజేయుండు" (అజయ్యుం డనుటకు?) "దుర్దమ శాత్రవపార్శ్వభేదికిఁ" 4 (128), అనియు;

౧౧. బలము—"కనకగిరి తటీసంకాశవక్షఃస్థలీభాగునకు" 1 (102);

" శ్రీరమణీరమణీయ మ। హోరస్స్థల విజిత కాంచనోర్వీధర వి।
స్తారితబలుండు" అనియు ;

౧౨. నయము—" సామాద్యుపాయవిదునకు " 1 (94), " నయోద్గతునకు " 1 (96), " నీతిచాణక్యునకు " 1 (98), " ఇతరసచివదాత్రుండు " 2 (120), " నీతిసంపదాఖండలపూజ్య " 3 (163), " భాసురనయశిక్షా " 4 (1)

" నీతి నిపుణమతి జిత పురుహూతామాత్యునకు " 4 (129), " రాజనయవిధా ప్రయోజనవిశారద " 8 (94) " మతివిజితసురేజ్యా " 8 (96), " అరిసచివ మహాశోపాయాపహారుఁడు,, 9 (86), " నరపతినయవిద్యానైపుణప్రౌఢభావా " 11 (144), అనియు, వర్ణితములు.

ఈతనినీతిపారగత్వము——వైరులచే మనుమసిద్ధి రాజ్యమును కోల్పోయి నప్పుడు ఈయన ఓరుఁగంటికాకతీయగణపతిరాజును దర్శించి ఆతనిచే ఆవైరుల నణఁగఁద్రొక్కించి మనుమసిద్ధిని వెండి నిజసింహాసనాసీనుం గావించుటచే-మిక్కిలి రూఢికెక్కినది. ఈవృత్తాంతము ఆంధ్రదశకుమారచరిత్రములో లేదు. వేతాకర ములచేఁ దెలియుచున్నది. ఇది ఆంధ్రదశకుమారచరిత్రమునకు తర్వాత జరిగియుండ నోపు. అట్లు కానిచో తత్కవి కేతన ఆగ్రంథములో మనుమసిద్ధిమహీవల్లభునకు ఈయన కరుణాపాత్రం బని వ్రాయుటకు మాఱుగా ఆమహీవల్లభుఁడే ఈయనకుం గరుణాపాత్ర మని వ్రాసియుండును. 'మనుమసిద్ధిమహీవల్లభసామ్రాజ్యస్థాపనా చార్య,' అను నిట్టి తీరున వర్ణించియుండును.

౧౩. తిక్కన విద్వద్వంశ్యుఁడు.——

" అగమకోవిదుఁడు మావెనార్యుఁడు పుట్టెను " 1 (28),
" కీర్తివిభూషణుం డయినకేతనకును సతినాచమాంబకును।
మూర్తిమదాగమంబు లన ముప్వురు పుత్త్రులు పుట్టిరి. " 1 (30),

వారు గుండన భాస్కర మహేశ్వరులు. ఇందలి యీ భాస్కరుఁడే సోమ యాజితాత. ఆయనప్రభావము ఇట్లు వర్ణితము:—

ఉ. " శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్యవి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం డర్థార్థిలోకావన
వ్యాపారవ్రతుఁ డంచుఁ జెప్పు సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరున్ భాస్కరున్. " 1 (32)

ఈభాస్కరుఁడు ఇంతటిదొడ్డవాఁడు గావుననే ఈతనింగూర్చి తిక్కన నిర్వ చనోత్తరరామాయణములో—

తే. " సారకవితాభిరాము గుంటూరివిభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన, మున్న నమెయి, లోక మాదరించు
నేల నాకృతిగుణములు వేయు నేల?"

అని చెప్పుకొనుట అత్యంతసమంజసమై యున్నది.

తిక్కనతండ్రులు నలుపురు:— కేతన మల్లన సిద్ధన కొమ్మనలు; వారు ఇట్లు వర్ణితులు:—

సీ. "వివిధవిద్యాకేళీభవనభావంబున
జలజాతముఖచతుష్టయముఁబోలి"
"ధర్మమార్గక్రియాదర్శకత్వంబున
సన్నుతాగమచతుష్టయముఁబోలి" 1 (34).

అందుఁ గేతన "కవితకు ముఖ్యుఁ డీతఁడు," "నవరసభావకుం డితఁడు" 1 (38), అని వర్ణితుఁడు.

ఆకేతన పుత్త్రిలలో నల్లసిద్ధి "సకలకలాపారగుండు" 2 (52)

నల్లసిద్ధి పుత్త్రిలు కేతనమల్లనలు "వివిధసత్కళాకోవిదులు" 1(53).

ఆకేతన పౌత్త్రుఁడు కేతన "బహుసత్కళానికేతనుఁడు" 1 (50).

తిక్కన రెండవ పెదతండ్రిమల్లనకుమారుఁడు మనుమసిద్ధి "వివిధ విద్యాభ్యాస చతురుఁడు" 1(60).

తిక్కన మూఁడవ పెదతండ్రి సిద్ధన నాలవకుమారుఁడు మల్లన "బహుశాస్త్ర ప్రౌఢుఁడు" 1 (78).

౧౮. తిక్కన గొప్పవిద్వాంసుఁడు:— "జాతకర్మముఖసంస్కారానంతరమున వేదాదిసమస్తవిద్యాభ్యాసవిభాసి" 1 (87),

"బహుకళాసంపన్నుండు" 1 (87),

"సకల విద్యాకలాచణుఁడు" 1 (88),

"వాక్పతినిభుఁడు" 1 (90),

"తెనుఁగున సంస్కృతమునఁ జతురుండై" 1 (91),

"వేదాది ప్రకట వివిధ విద్యాభ్యాసా। పాదితమహాత్త్వనకు" 1 (93),

"భారతీ సుస్థితిసం। భావిత సదనునకు" 1 (101),

"విద్యావైశారద్యస। ముద్ద్యోతితమతి" 1 (98),

"వాణీస్ఫూర్తిమన్మూర్తి" 1 (102),

"సకలాగమార్థ తత్త్వవిచారోదారుఁడు" 2 (119),

"పండిత పుండరీకవన పంకజబాంధవ" 3 (163),

"యోగవిద్యాభిరామా" 3 (165),

"నిఖిలలోకామోద సంపాది విద్యాధనునకు" 4 (130),

"తోయజభవనిభునకు" 5 (1),
"నిఖిలకలా సంవేదికి" 5 (135),
"నానావేదవేదాంగ తత్త్వజ్ఞునకు" 5 (136),
"శ్రుతి సుభగమూర్తికిన్" 6 (195)
"సారవిద్యా పవిత్రునకున్" 6 (196),
"విద్యానికషోపల" 7 (165),
"శ్రీవాణీ భూషాద్వితయావేష్టితమూర్తిలక్షిత" 8 (1),
"అనితరగమ్యవాఙ్మయ మహార్ణవవర్తనకర్ణధార" 8 (194),
"విద్యానిధానము" 10 (192).

ఈయన పైఁ జెప్పినయట్లు "వేదవేదాంతతత్త్వజ్ఞుఁడును" "బలసూదన విభవుఁడును" నగుటనందులకు ఫలముగా నిరంతర శ్రౌతస్మార్తనిష్ఠుఁడై యుండి తుదకు సోమయాజియై విరాజిల్లెను. దశకుమార చరిత్రలో కేతన ఎచటను అతనిని సోమయాజి యని పేర్కొననందునను, నిర్వచనోత్తర రామాయణములో తిక్కన "తిక్కన సోమయాజి" యని వ్రాసికొనక "బుధారాధనవిధేయ తిక్కననామధేయ" యని వ్రాసికొని యుండుటంబట్టియు, ఆరెండుగ్రంథములనాఁటికి అతఁడు సోమపానముం గావించి యుండలే దని తెలియ నగుచున్నది.

౧౫. తిక్కన మహాకవి:—

క. "అగు నను గొమ్మయతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచాటుకవితమై
నెగడిన, బాణోచ్ఛిష్టం
జగత్త్రియ మ్మనినపలుకు (?) సఫలం బయ్యెన్." 1 (89).

క. "కృతులు రచియింప, సుకవుల
కృతు లొప్పఁ గొనంగ, నొరునికిం దీరదు నె, వా
కృతినిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుఁడు తిక్కఁ డొకనికిఁ దక్కన్." 1 (90).

కృతు లందినందులకు ఈదశకుమార చరితమే మనకు దొడ్డ నిదర్శనము,

క. "అభిమతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్ర నామము
త్రిభువనమున నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్." 1 (81).

'చతురానన సన్నిభునకు' 1 (95),
'లలిత నానా కావ్యములు చెప్ప నుభయభాషలయందు' 1 (32),
'మయూరసన్నిభ మహాకవి' 1 (6),
'పద్యాది త్రివిధకావ్య పారీణునకుఁ' 1 (98),
'కావ్యకళా జనిభూమికిఁ' 5 (134),
'సారకవితా నిర్మాణ చాతుర్య' 7 (164),
'కవితా ధన్యుండు' 9 (84),
'భారవికల్ప' 9 (85).

౧౩. గుణములందును తిక్కన కొఱవడినవాఁడు గాఁడు:—

౧౪. కరుణగలవాఁడు:—

'కరుణాయత్తాత్మునకు' 5 (1),
'కృపాసక్త చిత్తునకు' 5 (135),
'అనుకంపాకర హృదయుఁ' 7 (1),
'కరుణోదాత్తుఁడు' 9 (84),
'కారుణ్య సముద్భవస్థలము' 10 (192).

౧౫. తిక్కన సుందరుఁడు:—

'రాజత్సుందరాకార' 1 (7),
'అభిరూప భావభవుఁడు' 1 (88),
'అంగజాకారునకుఁ' 1 (94),
'హృద్భవనిభ మూర్తికి' 1 (96),
'పుష్పాస్త్రరూపోపమా రాజన్మూర్తికి' 1 (100),
'పుష్పకోదండ తను ప్రభాచరవిధాన విశారద భవ్యరూప' 3 (163),
'పుష్పశర ప్రతిమానమూర్తికిఁ' 4 (128),
'అవ్యాజలీలా మనసిజునకు' 5 (136),
'మదన సమానాకృతి హృద్యునకు' 6 (1),
'వనితాబృంద నవీన మానసభవుఁ' 6 (194),
'కామినీ చిత్తచోరుఁ' 6 (196),
'నిరుపమమూర్తి' 8 (95),
'రతిపతి సమరూప' 8 (96),
'కాంతి పరిణామజితామృతధామ' 11 (142),

### ౧౯. తిక్కన వినయాది సుగుణభూషితుఁడు.

'పరహి తార్థికి' 1 (97),
'సౌజన్యాభరణునకు' 1 (99),
'మదస్మయదూర' 3 (163),
'సతత ప్రియ భాషణ' 3 (163),
'సుగుణామోద భరితవిభవ' 3 (164),
'సజ్జనాయత్తవృత్తా' 3 (165),
'జనవినుత వివేక క్షాంతి సంపత్తి సౌమ్యాత్మునకు' 4 (130),
'వినయనిధికి' 4 (130), 5 (136).
'శమా। దుర్మదభిష్ఛగ ద్వ్యక్కృతదూరవిచారసన కాంతరగ్విష।
'న్నిర్మథన ప్రభావ మహాసయ వివేక విశాల బుద్ధికిన్' 5 (134),
'గుణజాలక రత్నాకరునకు' 6 (1),
'వితత గుణ సముద్రా' 8 (96),
'వినయధుర్యుండు' 10 (193),
'వినయసంపదుదాత్తా'
'నిరుపమగుణ రత్నోన్నిద్ర' 11 (144),

### ౨౦. తిక్కన గొప్పదాత.

'దీనజనతానిధానంబు తిక్కశౌరి' 1 (88),
'వితరణశ్రీ యుతుఁడు' 1 (90),
'అర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబులుగా నిచ్చు' 1 (92),
'విద్వద్భోగ్య భాగ్యునకు' 1 (97),
'విశ్రుత విశ్రాణునకు' 2 (1),
'ఆశ్రిత భరణునకు' 2 (1),
'అతులసత్యత్యాగశీలంబులన్ వారిణుండు' 2 (118),
'దానపయో। ధారా పల్లవిత విప్ర ధాత్రీజుఁడు' 3 (1),
'అసమ దాన త్యాగ లీలాసముద్య ద్వినయనిధికి' 4 (130),
'అర్థిజనరాధేయునకు' 5 (1),
'ధనితాసంభవ హర్ష వర్ష వికసద్ధాత్రీసురున్' 6 (194),
'సతత దానవినోదీ' 8 (95),
'వితరణ రవి పుత్రా' 8 (96),

'వసుత్ప్రాప్తాచార్య వర్యుండు' 9 (84),
[మహాదాత గావుననే ఆచార్యవర్యులను దృప్తి నొందించినాఁడు.]

'కల్పక పరాభవకరణధురీణ దీర్ఘబాహుండు' 9 (85),
దీర్ఘబాహుఁ డనుటచే ఆజానుబాహుఁ డనుట—అందుచే కడమ మహాపురుషలక్షణములుం గలవాఁ డని సూచితము.]

'అర్థిమిత్రుండు' 10 (194),
'శ్రీవిష్ణారాధిత, దేవద్విజలోక' 12 (1).

## ౨౧. తిక్కన యఖండైశ్వర్యసమన్వితుఁడు:—

'బలసూదన విభవునకు' 1 (93),
'దేవేంద్ర విభవునకు' 1 (101),
'శ్రీశ్రిత వత్సునకు' 2 (1),
'శ్రీరమణుఁడు'' 3 (1),
'శ్రీసంయుక్త కటాక్ష' 4 (1),
'శ్రీయుతునకు' 5 (1),
'అపారవిభవ దేవేంద్రునకుఁ' 5 (1),
'లక్ష్మీమందిర రాత్రేయవంశాంబునిధి శశికి' 5 (136)
'దేవేంద్ర సమాన విభవ' 8 (10),
'నిర్జిత దేవేంద్ర విభవ' 8 (95);
'శ్రీవిలసన రమణీయా' 9 (1)
'కమలాకేళినివాస' 10 (192),
'అమరపతి సమానుండు' 10 (194),

## ౨౨. తిక్కన హరిహరోభయభక్తుఁడు.

'అభవ చరణాంభోజాత న్యస్త చిత్తునకు' 1 (99),
'పూజాతర్పిత రాజశేఖరునకుఁ' 1 (100),
'సేవాతర్పిత శశాంకశేఖరునకు' 1 (101),
'శ్రీకాంతచరణయుగళీ । శోకనదమధువ్రతునకు' 6 (1),
'హరపదపద్మైకావాస చిత్తమధుకర' 8 (1),
'భావిత భవపాదపద్మ' 9 (1),
'ఆశ్రిత శివధ్యానుండు' 9 (84),

'హరిహరచరణకమలోపాస్తి' 10 (1),

౨౩. తిక్కన కవిపోషకుడు:—

'కవిజనరాజకీర సహకారము' 1 (8),

'సుకవీంద్ర బృంద రక్షకుడు' 1 (88),

'కవిసరోజ మార్తాండునకు' 1 (99),

'కవీంద్రలోకాధారుండు' 2 (119),

'పోషిత సత్కవీంద్రునకు' 4 (128),

'కవిలోక చాతకవ్రజ। నవజలద స్తనిత భావణప్రకరుడు' 9 (85).

౨౪. అతని శ్రౌతస్మార్తకర్మనిష్ఠ దశకుమారచరితములో ఈ తీరున వర్ణితము.—

'అధ్వరాజ్య గిననాథునకు' 1 (94).

'చతురానన సన్నిభునకు। సతతస్వాహాస్వధేతి శబ్దద్వయ సం
స్కృత హవ్యకవ్య సంతర్పిత ముఖశిఖి ముఖ నిలింప పితృవర్గునకు' 1 (95),

'ఆగమప్రకటితకర్మ ప్రస్ఫురన్మూర్తికి' 1 (100),

'ఉదాత్త శ్రౌతస్మార్త కర్మతత్పరమతికి' 2 (1)

'వేదోదిత కర్మవ్రత' 3 (164),

'సతతాధ్వరక్రియా కర్కశ పాణిపద్మునకు' 5 (134),

'మఖసంతోషిత మరుత్సమాజునకు' 5 (135),

'యాజక మండలోత్తమా' 8 (94),

'యాగావహరణ నిపుణ చిత్తుండు' 9 (86),

'ఆగమగోష్ఠీ ఘటనప్రదేశము' 10 (192).

౨౫. తిక్కన నన్నయాలప్రభావములు.—

ఇట్టి యీ పుణ్యశ్లోకుడు తనకు స్వప్నమున హరిహరనాథుడు ప్రత్యక్షమై ఆంధ్రభారతశేషనిర్మాణమునకు ఆదేశము నొసంగె నని తానే చెప్పికొని యున్నాడు. ఈయన మనయాంధ్రవిద్యకు ద్వితీయముని గదా. ఆంధ్రప్రథమముని యైన శ్రీనన్నయ భట్టారకుడు వినుతులచే పరమశివుని మాటలాడించె నని యొకానొక కవి వర్ణించియున్నాడు:— ప్రబంధరత్నాకరము- పెదపాటి యెఱ్ఱాప్రగడ.—

సీ. 'ఈకుచే గాంచి సాహిత్యవిద్య ధరిత్రి। నిల్పినయట్టి పాణిని భజించి,

శ్లోకార్థమున జంద్రజూటు మెప్పించి యుత్ప్రార్థము ల్గాన్నమల్హణు నుతించి,

గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు । ప్రతిభతోఁ బడసిన బాణుఁ దలఁచి,
శతకంబు చెప్పి భాస్కరుని మెచ్చఁగఁ జేసి। యురు దేహుఁడైన మయూరుఁ గొలిచి,

తే. భవుని మెప్పించి కన్నులు బండిఁ దెచ్చి (?)
వనిత కిచ్చిన కాళిదాసునకు మ్రొక్కి,
హరుని వినుతులచే మాట లాడఁ జేసి
నట్టిభట్టుని నన్నయభట్టుఁ బొగడి.

ఇట్టి యీమునిపుంగవుల యైదవవేదము లోకమునకు లక్ష్యలక్షణప్రమాణ మగుట ఆశ్చర్యమా?

బ్రహ్మకల్పుఁ డయిన యీమహాపురుషుఁడు ఆంధ్రగీర్వాణ భాషలయందు మహాకవియై రచించి యాంధ్రలోకము నుద్ధరించిన గ్రంథములలో రెండే నిర్వచనోత్తర రామాయణంబును విరాటపర్వాదిభారతోత్తరభాగంబును ప్రకటోపలంభములు. "విజయసేన" మని యింకొకటి ప్రబంధరత్నాకరమునం బ్రస్తావింపఁబడియున్నది. ఏతత్కృత "కృష్ణశతక" మని యొకగ్రంథమును నిర్వచనోత్తరరామాయణోపోద్ఘాతములో శ్రీ నాగపూడి కుప్పుసామయ్యగారు ప్రస్తావించియున్నారు. "కవివాగ్బంధన" మని యొక చిన్నలక్షణగ్రంథమును గూడ తిక్కన రచియించె నని (1912 సం) మదరాసు రాజకీయ లిఖితపుస్తకభాండాగారాంధ్రగ్రంథ వివరణమున నున్నది.

౨౬. సుకవన కుకవన స్వరూపములను తిక్కన తానే నిర్వచనోత్తర రామాయణములో నిట్లు వివేచించియున్నాఁడు.—

తిక్కన చెప్పిన సుకవనప్రకారము.—

ఉ. "భూరివివేకచిత్తులకుఁ బోలు వనం దలఁపుందళంబులన్
సౌరభ మిచ్చుగంధవహుచందమునం బ్రకటంబు సేసి యిం
పారుపలుక్కులం బడయ నప్పలుకు ల్సరి గ్రచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగావలయుఁ జేసెద నేఁ గృతి యన్నవానికిన్." 1 (5).

క. "తెలుఁగుకవిత్వము చెప్పన్ । దలఁచినకవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొనివళులుం బ్రాసం।బులునిలుపక యొగిని బులిమిపుచ్చుట చదురే." 1(7).

క. "అలవడ సంస్కృతశబ్దము । తెలుఁగుబడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం।బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్." 1(8)

క. "ఆ సత్కవీంద్రమార్గము। మనమున నెలకొలిపి సరసమధురవచోగుం
ఫన సుప్రసాదసంబో। ధనగోచర బహువిధార్థ తాత్పర్యముగాన్." 1 (10).

శా. "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప, వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్యముఁ దోడుగఁ జెప్పిపెట్ట, నౌ
ద్ధత్యము సోఁపఁ బ్రాసముప్రకారము వేఱగునక్షరంబులన్
ప్రత్యనురూప మంచు నిడ, సూరుల కిట్టి విధ మింపు వెంపదే." 1 (14)

క. "వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁ గొంత వచ్చుఁ బ్రౌఢులకుఁ, గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పుటార్య లొప్పిద మనరే." 1 (15).

[ఈపద్ధతి యొప్పదని గావలయు నీయన భారతములో నెనిని మూర్చ్ఛకొని వచనములను సమృద్ధిగాను ప్రౌఢముగాను చేర్చినాఁడు ]

క. "లలిత పదహృద్యపద్యం
బుల సకలార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతియలఁతి తునియలఁ గా
హాల సంధించువిధమున నమరఁగఁ గలయున్." 1 (16)
[కాహా = కాహళ = కాహళి = బాకా, కాకె.)

౨౭. తిక్కన చెప్పిన కుకవి ప్రకారము.—

చ. "పలుకులపొందు లేక, రసభంగము సేయుచుఁ, బ్రౌఁతవడ్డమా
టలఁ దమ నేర్పు సూపి, యొకటన్ హృదయం బలరింప లేక, యే
పొలమును గానియట్టిక్రమమున్ దమ మెచ్చుగ, లోక మెల్ల న
వ్వులఁబొరలం జరించుకుకవుల్ ధర దుర్విటులట్లు చూడఁగాన్." 1 (8)
[క్రమమున్ = క్రమము సైతము!]

అనుప్రసక్తము:—ఇట్లు కుకవినింద సల్పుటచేతనే తన ప్రభావముం గూడ నుదాహృతపద్యములందు గమ్యముగాఁ జెప్పికొనియుండనియక వాచ్యభంగిగా సయితము ఈయన చెప్పికొనియున్నాఁడు:—

చ. "హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నసత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగ వారికృపం గవితావిలాసవి

స్తరమహనీయుఁ డైనను సర్వశాస్త్రరమూర్తి మస్త్రఘా
వరుఁడు దగంగ రాఁబనిచి వారనిమన్నన నాదరించుచుఁ." (2).

మ. " అమలోదాత్తమనీషమై నుభయకావ్యప్రౌఢిఁ బాటించు క
ల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ నాపస్తంబసూత్రుండఁ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైక శీలుండ న 1 (13).
న్నమకుం గొమ్మనమంత్రికి న్సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్."

ఇందువలన నీకవనముం దొడంగుటకు తనకుంగలయర్హతను దెలుపుకొన్నాఁడు. ఇట్లే ఇతనికి ముందు నన్నయయు, తనస్వరూపమును జెప్పికొనియున్నాఁడు. ఇది వక్ష్యమాణగ్రంథములో విశద మగును; మఱి యిటీవలివా రయిన శ్రీనాథాదుల స్వప్రభావోక్తులమాట చెప్పనే అక్కఱ లేదు.

## ౨౮. ఇంచుక శాఖాచంక్రమణము.

నాటకములలో కవిని సూత్రధారుఁడు ప్రరోచనార్థము ప్రతిభాదివిరాజితు నిఁగా నుగ్గడించును. అది నాటకసంప్రదాయము. అట్లని రసార్ణవసుధాకరమునఁగు శ్రీ సర్వజ్ఞ యాచేంద్ర మహీపాలుఁడును బ్రతిపాదించియున్నాఁడు. సంప్రదాయ మని యెఱుంగక సూత్రధారకృతస్తుతిమాత్రముననే కవి ఆత్మస్తుతి చేసికొన్నాఁడని కవిని నిందించుట అజ్ఞసంప్రదాయము. సూత్రధారుఁడు కవిని ఉగ్గడింపక,—

" కవియొ చిఱుతవాఁడు కవనంబు వెఱుఁగఁడు
లక్షణంబు సున్న; లక్ష్యమన్న?
మన్న; నాటకంబు మదమెక్కి రచియించె;
దానిబగిసి మీరు గానరయ్య."

అని వచించునేని ఆయాట నెవ్వరుం గానరు; లేచి పోవుదురు. మనయుప్రతాపరుద్రీయాది నాటకములందు "అంకెకుఁ దార్చె" నిత్యాది పద్యములంగూర్చి రసికులకు మీకు ఈసమాధానముం జెప్పికొంటిని.

ఇందులో నొకక్షుపాగ్రహణము:-"అంకెకుఁ దార్చె" నిత్యాదిపద్యమందు 'జంకు కళంకు లేని కవిచంద్రుఁడు' అనియున్నది. 'కళంకు' శబ్దము తెలుఁగులోఁ లే దని యొకానొకరు నన్నాక్షేపించిరి. ఆశబ్దము సవ్యుత్పత్తికముగా అపాదము సూరనార్యునిచే కవిసంశయవిచ్ఛేదమునం బఠిత మని నాయుత్తరమును వారి కంపించితిని. రెండియు నిట మీకు నివేదించికొంటిని. తిక్కనచరిత్రములో ఏకదేశముగా తిక్కప్రస్తావ మిది క్షంతవ్యము.

౨౬. తిక్కన కవన మహిమ —.

ఈయన నిర్వచనోత్తరరామాయణములో తాను ప్రస్తావించికొన్నట్లే తన కవన మెల్ల మృదుమధురముగానే రచించినాఁడు.—

ఆంధ్రభారతధోరణిం గనినను, ఈతని నిరంతర వైదికకర్మపరతంత్రతతోడ మంత్రివ్యాపారప్రవణతం దలఁపున నుంచుకొని పరికించినను, ఆంధ్రభారతము ఆశుకవనముగానే కాకున్నను తత్ప్రాయముగానే కానిపించును.

ఈతని భారతభాగములో ప్రతిపద్యమును ఆడంబరము లేకయే ఈతని ప్రౌఢిస్వీకవిశేషముం దెలుపును.

ఇమిడిక, పెంపకము, లక్షణానుసరణము, భాషాస్వాభావ్యము, పరిశుద్ధి, రససంపద, జాతీయము— అనునివి తిక్కనకవనమునం గలవిశేషములు.— అందు పెంపకము ఆశుతను తోఁపించును. ఈయనను భారవి మయూర భోజకల్పుఁ డని కేతన వచించినాఁడు గదా. అది కరము సరియైన యభిప్రాయము. అట్లే ఈతనికవనములో భారవియర్థగౌరవమును, మయూరునిపరిఢవంబును, భోజునిచదురును, గలవు. మఱియు బాణుఁడు చెప్పని యపూర్వములను ఈయన చెప్పినాఁడని కేతనయే చెప్పినాఁడు. కవనమందు అత్యంత సారళ్యముతో అత్యంతగాంభీర్యము బెరయ రచించుటయందు తిక్కనకు సాటి తిక్కనయే. ఈతని యలంతిసాటువలఁ కావ్యేందిరకు అలంకరణములు మాత్రమే గాక పోషణములు గూడ నగును. లోకసిద్ధములే యయినను అవి ఈతని పద్దెములలోఁ బడి వానితో నటనే మొలచినవియుంబోలె తదైక్యభావముం బొంది యుండును. ఇంచుక యుదాహృతి.

(1) సుదేష్ణ తనకడ సైరంధ్రిగా నుండఁగోరి యేతెంచుచున్న ద్రౌపదిం గని చేరఁ బిలిచి యాదరించుట. విరాట. 1 (309, 10).

“ కేకయరాజనందనయును.—

చ. కనుఁగొని గారవంబును మొగంబునఁ, గేలఁ బురఃప్రసారముం,
దనువున నమ్రభావమును, దంతమరీచుల సామినిర్గమం
బును, దనలోఁ గడల్కొనఁగ, భూరితరాదరరేఖ నిందు ర
మ్మనవుడు, నంతనంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్.”

ఇందలి యాధారాధేయములు ద్రౌపదివి గాని సుదేష్ణవి గావు; అయినను ఈపాత్రమున ఆదరమున భూరితరత్వమునకు నిమిత్త మగపడదు. ‘తనలో’ అనఁగా ద్రౌపదీలోనా, సుదేష్ణలోనా? ఏపక్షమునను అర్థపోషణ లేదు, పూర్వార్ధమందలి సప్తములను ప్రథమలం గావించిన, ఈపద్యమునకు జీవకళ వచ్చును. ‘తనలోఁ గడ

ల్కొనఁగ' అనఁగా సుదేష్ణహృదయమందు వ్యాపింపఁగా (నాటుకొనఁగా)-ఆమె చిత్తమున కెక్కఁగా-అని యర్థ మగును. పద్దెమును సోమయాజులవారు ఈ క్రింది యట్లు పలికియుందు రని నాతలంపు:—

(1) చ. "కనుఁగొని—గౌరవంబును మొగంబును, కేలుఁ బురఃప్రసారముం,
దనువును నమ్రభావమును, దంతమరీచులు సామినిర్గమం
బును, దనలోఁ గడల్కొనఁగ, భూరితరాదరరేఖ నిండు ర
మ్మనవుడు నంతనంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్."

ఈపాఠమున భూరితరాదరరేఖన్" అని తృతీయార్థకముగా నన్వయము.

['రేఖ యిందు' అని ప్రథమ చేసిన, సుదేష్ణముఖమున భూరితరాదర మగపడె ననియు ఆయాదరము 'రండి అమ్మ రండి' అనుపిలుపుతోనె ద్రోవదికి ధైర్య మొసంగె ననియు భావము.]

ఇందలి నుద్వ్యయములు అననుగుణతం దెలుపును. విస్తరభయంబున వ్యాఖ్య వ్రాయకున్నాఁడ. రసికులు అర్థము నూహించుకొందురు గాక. ఈపద్యమున కవనము గోదావరిజిల్లా యావకాయయూరుఁగాయ బ్రద్దవంటిదిగా నున్నది.

[ఈపద్యమునకు శ్రీసుందరరామశాస్త్రిగారును శ్రీ సూర్యనారాయణశాస్త్రి గారును రచించినటీకను నేను ఈవ్రాఁత ముగిసినపిమ్మట నిటీవలం బరికించితిని. దాని యందు మదూహితపాఠము పాఠాంతరముగా నుపలబ్ధమైనట్లు ఒసంగఁబడియున్నది. "తనలోన్" అనుమదీయపాఠమునకు వారు "తమలోన్" అని మాత్రము భిన్నముగా ఆపాఠాంతరమును ఉదాహరించినారు. ఈసమన్వయముతో ఈయేకవచన పాఠ మును రసజ్ఞశ్రేష్ఠులు వారును అంగీకరింతు రని తలంచెదను.]

(2) "ఎత్తెలఁ గొందుఁ గొంపుల నెల్ల" విరా. 4 (69).

[ఎత్తెల = చేఁపలఁబట్టెడి యడ్డువల, శ. ర.; ఈయన నదీతీరవాసి యని ఈప్రయోగము సూచించుచున్నది.]

(3) తే. " ఆఁడుఁజందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నది; యొప్పు నూష్మలత సొంపు
వికృతవేషావృతంబు లై వెలయ కితఁడు [పా. వెలయునితఁడు!]
నివులు గవిసిన మెఱయనినిప్పు వోలె." విరా. 4 (75)

[ఒప్పున్ క్రియ; కర్త ఇతఁడు; ఊష్మలత, సొంపు-ప్రథమలు, వానికి ఐ, వెలయక, క్రియలు.]

(4) " పిసుగులపిండు బిట్టులియు వెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్."

(5) తే. "అరసికొని యొన్నిభంగుల నైన నితని
తేరు మనవారి కగపడు తెఱఁగు గాంచి
యదరి బాసటయైరి యెవ్వ రడ్డపడిన,
మెఱపు మెఱసినచాడ్పునఁ దఱియఁ జొరడు." విరా. 5 (16).

(6) సీ. "గోఁగఁ బోఁజిన (జీరిన-పా.) మాడ్కిఁ గొన్నింటిఁ జక్కసా
పాలుగా వ్రయ్యలు వాపి వాపి,
బాడిస నఱికిన భంగిఁ గొన్నింటిఁ దు
త్తునియలుగా బిట్టు ద్రుంచి ద్రుంచి,
వెస లంపమున నిడ్డపసిగఁ గొన్నిటి నిసు
మంతలుగా నుఱుమాడియాడి,
పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ
జిఱునుగ్గుగాఁ బొడిసేసి చేసి,
తే. ఆదరి పొదివినబలము నా (ల?) నాయుధములఁ
బ్రతిహతంబులఁ గావించె నతిరయమున
నతులితధ్వజ సూత హయాత్వ లసద
ఫల్గురథవల్గనుం డగుఫల్గునుండు." విరా. 5 (35)

(7) వ. "ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబున దదీయరథంబు గౌరవసైన్యంబునందు సంచరించు నయ్యవసరంబున." విరా. 5 (49).

(8) ఆ. "రత్నకేతనములు, రాజితశేఖరం
బులును, రుచిరఘంటికలును బార్థు
బాణనిహతిఁ దునిసి పడుఁ, గౌరవులచేటు
దెలుప నుల్లునుల్కకలును బోలె." విరా. 5 (50).

ఈక్రిందిది అర్జునాశ్వత్థామయుద్ధములోనిది.

(9) చ. అతఁడును దీవ్రబాణముల నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శతముఖవృత్రసంగరముచందము దోఁచె, వడిం జటచ్ఛటా
యితరవ మప్డు వేణువుల నేర్చు వాదనలుబ్రమోఁతభంగి ది
క్తతిఁ బరఁగెఁ, మహాద్భుతము గౌరవసేనకు నావహిల్లఁగన్." విరా.

ఈయుదాహృతమం దంతటను శమియందు పావకంబుపోలెను, గ్రాఁగిన క్షీరమున స్వాదిమపోలెను, ఈ విద్వత్ప్రభుని కవితాపరిపాకము అభ్యంతరలీనమై యున్నది. దానిని అనుభవరసికులు తెలుంగుదురు.

## ౩౦. తిక్కన నధిక్షేపించువారు.

వస్తువిట్లుండ, కారణవిశేషములచే ఈనడుమ కొందఱు గోదావరిజిల్లా వారు "తిక్కన నెల్లూరితెలుఁగు పెట్టి భారతమును పాడుచేసినాఁడు" అని నిజమతిని మిత్రులతోఁ దెలుపుకొనుటయు, వారు దానిని నెల్లూరి యువరసికులమ్రోలం బలుకుటయు వీరు అందులకు కక్కసించుటయును సంభవించినవి.

ఇందులకుం బ్రతిమల్లముగా గుంటూరివారు తిక్కన తమకృష్ణామండలమువాఁడనియు, భారతమునందు తమసీమతెనుఁగుం బెట్టి దానిని ఘ్రణ్యాక్ష్వదాస్వాద్యమయిన మహీతల సుధాతరంగిణిం గావించినాఁడనియు, వాదించుచున్నారు.—ఇప్పటికిని కృష్ణాపినాకినుల తెలుఁగులకు ఎక్కుడుభేద మగపడదు; సామ్యమే మెండు. తిక్కన త్రిపూరుషము నెల్లూరివాస్తవ్యుఁడని నిరూపితమే గదా; షట్పూరుషముగా నచ్చటివాఁడే యనియును దశకుమారచరిత్రములోని తదీయవంశవర్ణనచే నూహానీయమై యున్నది. కావున తిక్కన నెల్లూరితెనుఁగునే (అనఁగా గుంటూరితెనుఁగునే) భారతమునం బెట్టినమాట వాస్తవమే గాని పాడుచేసె ననుట పాడి గాదు. పాడిచేసె నని గుడి కట్టించుట ఇహపరసాధకము. భారతమే ఎల్లవారికిని మహానిఘంటువును లక్ష్యంబును లక్షణంబును అని విద్వత్సమయ మగుటంబట్టియు, సహజముగానే తిక్కనయేర్చి కూర్చినయాంధ్రభాషయొక్క మాధుర్యాదిగుణవైభవముచేతను, అదియే సకలకవివతంస సంసేవిత యై గుంటూరివిద్వత్సింహులు వర్ణించిన సుధాతరంగిణి యైన దని విద్వదభ్యుపగతి. నన్నయ తిక్కనల కవనములందు దేశభేదద్యోతక భాషాస్వాభావ్యభేదము కలదో లేదో పరిశీలించి సిద్ధాంతించుట బహుప్రయోజనకారి.

తిక్కనను ఇంతటితో వదలక ఈయన అవైయాకరణుఁడని కొందఱిదానీంతనులు అధిక్షేపించి, అందులకు నుదాహరణముగా తెనుఁగుపదముపై తత్ప్రియుక్తము మయట్టు కల దని నుడివినారఁట. అట్టిప్రయోగములు 'ఎండమయము' 'వానమయము' అనువానివలె నుండును. ఇట్లు మయట్ప్రత్యయమును తిక్కన ప్రయోగించె నని నేను చెప్పఁజాలను గాని, "సాత్కరించె" నని సాతిప్రత్యయమును తెనుఁగుపదముపై ప్రయోగించుట నెఱుంగుదును. అట్లే ఎఱ్ఱాప్రెగ్గడ మయట్టును బ్రయోగించె ననియు నే నెఱుంగుదును. "సాత్కరించి" అని శ్రీనాథుండును తిక్కనం బ్రమాణీకరించికొని నైషధమునఁ బ్రయోగించినాఁడు ౮ (108), సంప్రదానవాచక ప్రాతిపదిక సంఘటితము కాని యిట్టి సాతిప్రయోగము నెవ్వరును తడవినవారు లేరు. సర్వప్రమాణభూతు లైనకవిత్రయమువారు ఉత్తమములే యని కావించినప్రయోగములను ఆశ్రీనాథునివలె మనము కన్నుల నద్దుకొనవలసినవారమును తెలివిగలమేని కాని

స్వారస్యమును ఎఱుంగవలసినవారమును అగుదుమే గాని ఆధిక్షేపింప నధికారులము గాము. చతుస్సముద్రములు, త్రికాలములు, శతాబ్దములు, ఇత్తెఱంగు సంఖ్యాపూర్వక సమానాధికరణ సమాసములు నన్నతిక్కనోభయ సాధారణములు. వీనింబట్టి సకల భాషా వాగనుశాసనులవారికి సంస్కృతవ్యాకరణము మాత్రము తెలియదని మనము ఘోషింపవలసినదా ?

మఱియు, ఆధునికులలో "చాపము నా కందిమ్ము" ఇత్యాది శబ్దపల్లవముల యందును, "ఎఱిఁగించిపుడే" ఇత్యాదిలేఖకాది ప్రమాదములయందును, క్త్వార్థకేకార సంధిదోషముం జూపువారు కలరు. వారికి ఉత్తరమేల? వారే వీనినే ప్రమాణీకరించి క్త్వార్థకేకారసంధిని తామే చేయుదురు.

మఱియు, అఖండయతిప్రియులు "భద్రాయతమూర్తి" యని పఠింతురు. "భద్రాయిత" యని పఠించినందులకు అప్పకవిని దూఱుదురు.

అనేకులు తాము ఏయే చెడుప్రయోగములం గావింతురో వాని కెల్ల ప్రమాణములుగా భారతమున తాము కల్పించినపాఠములను, ముద్రకాది ప్రమాద జనితములను, ఉదాహరింతురు. ఇట్టివానిని 33 టిని పూర్వము నేను అముద్రితగ్రంథచింతామణిలో ప్రామాదికము లని, స్థాపించి సవరించితిని. అటుపై భారతముద్రకులు అందు 32 టిని దిద్దికొని "కానతగఁ" అనుచో "కాన" వనవాచకమ యైనను అవ్యయముగా గ్రహించిరి. నాఁటనుండి "కాన" (కావునకుఁ బర్యాయము) ఆనంద భారతమున కళగా నెలకొని ఇతరములకును కళగా నెక్కుచున్నది. ఆ 33 సవరణలకుం గారణమయినవారు తదప్రాసము పెట్టుకొనిరి, వారు ఆక్షేపించినవారికి "కానఁదగఁ" అని పఠించి పైపద్యమును, కర్ణ. 3 ఆ. 31 పద్యమును, ప్రమాణములనుగాఁ జూపిరి. కర్ణునింగూర్చి ధర్మరాజు వచించుట.—

చ. "అతనికి నాకునుం గలిగె సాహస మంతకు ముందరందుఁ బా
ర్షసుతుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును శూరతఁ గా నతఁడు సూతహయధ్వజపాతనంబు సే
సి తనువుఁ దీవ్రకాండములఁ జెండఁగ నే విఱ గందితిఁ గడుఁజా."

ఇందు "పార్షదుఁడు" అనియే సీతారామాచార్యులవారు సయితము శ. ర. సుద్ధారమునం బఠించినారు. అయినను ఇట "పార్షతుఁడు" అనుటకు "పార్షదుఁడు" అనుట లేఖకాదిప్రమాదజనిత మని నేను అముద్రితగ్రంథచింతామణివ్యాఖ్యములందు సప్రమాణముగా స్పష్టపఱిచియున్నాఁడను.

నేఁటికవు లనేకులు "చేతురు" "కోతురు" ఇత్యాది రూపములను సైతము భారతమువలననే సాధూకరింప దొరంకొనుచున్నారు.

అధిక్షేపార్థము గాకున్నను, ప్రామాణికబుద్ధిచేతనే అయినను, అప్పకవి "ప్రాసముప్రకారము వే ఱగునక్షరంబులన్ శ్రుత్యనురూప మంచు నిడ" నను తిక్కనగారి ప్రతిజ్ఞకు భంజకములుగా "సుదేష్ణ" యనుటకు "సుధేష్ణ" యనియు, "ప్రతీవింధ్యుఁ" డనుటకు "ప్రతివింద్యుఁ" డనియు, భ్రమచే పఠించి లేనిదధప్రాసములను, సోమయాజులవారికి ఆరోపించినాఁడు. అందులతత్త్వ మును విశదపఱిచెద:—అప్పకవి యుదాహరించిన యాపద్యము లివిగో:—

క. "ముద మొదవ రమ్యహర్మ్యము
తుదినిలువున నిష్టసఖులతోడ విహారా
స్పద మగు నెలవున మెలఁగెడు
సుధేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్." విరాట. 1 (301).

క. "వింధ్యాద్రివోలె నా ప్రతి
వింద్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి ద
ర్పాంధ్యమతి నదరి దీప్తా
వంధ్యాస్త్రము లకుమారవరుపైఁ బఱపెన్." ద్రోణ. 5 (170).

## సుదేష్ణ.

భార. విరా. కుంభఘోణ ముద్రణము-దేవనాగరము:...

"తస్యాం కేకయరాజ్ఞ స్తు సుదేష్ణా దుహితాఽభవత్...
తాం విరాటస్య మాత్స్యస్య కేకయః ప్రదదౌ ముదా." 21 (16...19).
,,—,,—కలకత్తా...(ప్రతాపచంద్రరాయి):...
"సుదేష్ణోవాచ" 9 (9, 22, 35); 15 (5, 10, 16); 16 (48, 50).
"యాజ్ఞసేనీ సుదేష్ణాం తు శుశ్రూషన్తీ విశాంపతే।
అవసత్ పరిచార్యార్హా సుదుఃఖం జనమేజయ." 14 (2).
"తథా చరన్తీం పాఞ్చాలీం సుదేష్ణాయా నివేశనే."—,,—(3).
"తతః సుదేష్ణా మనుమన్త్ర్య కీచకః."—,,—(11).
"ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుదేష్ణాం కీచకోఽబ్రవీత్." 15 (1).
"తాం సుదేష్ణే పరీప్సస్వ."—,,—(2).

"సుదేష్ణా సూత మబ్రవీత్."—,,—(4).

"సుదేష్ణా ప్రేషయామాస సైరన్ధ్రీం కీచకాలయమ్."—,,—(9).

"ఇత్యుక్త్వా ప్రాద్రవ త్కృష్ణా సుదేష్ణాయా నివేశనమ్."-,,-16 (46).

"శోచన్తాఽస్మి సుదేష్ణాయా అస్యధూర్తస్య కారణాత్," 20 (1).

"ఆసీ త్సాఽద్య సుదేష్ణాయా భీతాఽహం వశవర్తినీ."—,,—(22).

"సాఽహ మద్య సుదేష్ణాయాః పురః పశ్చా చ్చ గామినీ."—,,—(23).

బాలభారత కావ్యము—(దేవనాగరలిపి.)

"సపది సుదేష్ణాయై స న్యవేదయ త్తద్గతం భావమ్." విరా. 1 (62).

"మదనాసహం సహోదర మవలోక్య తతోఽవద త్సుదేష్ణా సా" (63).

"మద్యకృతే సచ్ఛలయా తద్వత్సలయా సుదేష్ణయా బలతః." (97)

మోనియరువిల్లియమ్సు నిఘంటువులో 'దేష్ణ' శబ్దము కలదు-వైదికము, ఇచ్చుట యర్థము. ఇందులకు 'కుమారదేష్ణ' 'చారుదేష్ణ' ఇత్యాదులు ఉదాహృతములు.

ప్రతివిన్ధ్యః.

భార. ఆది. (ప్రతాపచంద్రరాయి.)

"పాణ్డవేభ్యో హి పాఞ్చాల్యాం ద్రౌపద్యాం పఞ్చ జజ్ఞిరే...
ప్రతివిన్ధ్యో యుధిష్ఠిరాత్ సుతసోమో వృకోదరాత్." 63 (117-8).

"తత్ర ద్రౌపదీం భార్యా మవిన్దన్ స్వవిషయం చాభిజగ్ముః। కుశలినః పుత్రాం శ్చోత్పాదయామాసుః। ప్రతివిన్ధ్యం యుధిష్ఠిరః సుతసోమం వృకోదరః." 95 (73-74).

కుంభఘోణ ముద్రణము—(దేవనాగరము).

"పాఞ్చాలీ సుషువే వీరా నాదిత్యా నదితి ర్యథా।
యుధిష్ఠిరా త్ప్రతివిన్ధ్యమ్." 247 (77).

"శాస్త్రతః ప్రతివిన్ధ్యం త మూచు ర్విప్రా యుధిష్ఠిరం।
పరప్రహారణజ్ఞానే ప్రతివిన్ధ్యో భవ త్వయమ్."—,,—(77).

[ఇందులకు అధోజ్ఞాపిక—"పరప్రహారణజ్ఞానే శత్రుకృత ప్రహారవేదనాయాం విన్ధ్య ఇవ నిర్విజ్ఞాన ఇతి ప్రతివిన్ధ్యః."]

"దుశ్శాసనుండును ధర్మనందన నందనుండును బోరు నెడ నప్పాండుపౌత్రుం డతనిఫాలంబున వాలికనారసంబులు మూఁడు నాటించినం ద్రిశిఖర యుత శైలంబు లీల నయ్యెవరా జొప్పి యవ్వీరుం గ్రూరశరంబులం గప్పి కేతుసారథిరథంబులఁ దిల ప్రమాణశకలంబులు సేసిన...(169).

ద్రోణపర్వము— తెనుఁగున—5 (169-70).

క. వింధ్యాద్రి వోలె...(170).

ఈతెనుఁగునకు మూలభూత మైనఘట్టము—(ప్రతాపచంద్రరాయి) ద్రోణ.

"ప్రతివిన్ధ్యం సమాయాన్తం ప్రహరన్తం రణే రిపూన్
దుశ్శాసన స్తవ సుతః ప్రత్యగచ్ఛ న్మహారథమ్. 169 (34)...
ప్రతివిన్ధ్యస్తు సమరే కుర్వాణం కర్మ దారుణం
దుశ్శాసనం త్రిభి ర్బాణై ర్లలాటే సమవిధ్యత. (36)
సోఽతివిద్ధో బలవతా తవ పుత్త్రేణ ధన్వినా
విరరాజ మహారాజ సశృఙ్గ ఇవ పర్వతః." (37)
దుశ్శాసనం తు సమరే ప్రతివిన్ధ్యో మహారథః
నవభి స్సాయకై ర్విద్ధ్వా పున ర్వివ్యాధ సప్తభిః. (38)
తత్ర భారత పుత్త్ర స్తే కృతవాన్ కర్మ దుష్కరం
ప్రతివిన్ధ్యహయా నుగ్రైః పాతయామాస సాయకైః. (39)
సారథిం చాస్య భల్లేన ధ్వజం చ సమపాతయత్
రథం చ తిలశో రాజన్ వ్యధమ త్తస్య ధన్వినః." (40).

ఈప్రకారముగా సుదేష్ణా ప్రతివిన్ధ్య శబ్దములు కలకత్తా బొంబాయి కుంభఘోణాది దేవనాగర ముద్రణములయందు యథాక్రమము తవర్గ తృతీయ చతుర్థ వర్ణ ఘటితములుగానే నిఘంటువుచేతను టిప్పణముచేతను మూలగ్రంథగత నిర్వచనముచేతను నిరూపితములై అట్లే ముద్రితములై యున్నవి. కావున ఈశబ్దములు గల పూర్వోదాహృత విరాట ద్రోణ పర్వ పద్యములయందు దథప్రాస మని యప్పకవ్యాదులు పల్కుట ప్రమాదిక మని యెన్నవలసి యున్నది.

మఱియు నప్పకవి యీక్రింది 'డ' ప్రాసమును భ్రమచే స్వవర్గజ (దడ) ప్రాసముగా నుదాహరించినాఁడు.—[ఇట దేని కేది స్వవర్గజము ?]

ఉ. "ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోట నాకనాఁ
కొండు నలంగు న్నిదురకుం దఱి దప్పెను డప్పి పుట్టె నో
క్కండను నెట్లొకో యనక కార్యము గల్గినవేళ నేలినా
తం డొకచాయఁ జూపినను దత్పరతం బని సేయుటొప్పగున్."విరా.1 (135)

ఇందు "ఆఁక్రొందును" అనుపదమున 'క్రొందు' ననునది 'క్రొను' ధాతువు యొక్క తద్ధర్మార్థకోత్తమ పురుషైకవచన రూపభేదము.—"ఇట బిందువుమీఁదితద లకు నిత్యవైకల్పికంబు లయి టడ లగు." బాల. క్రి సూ. 59.

కొందఱు, 'ఏన విదప' అను వాక్యావయవమును, 'ఏను విదప' అని పఠించి 'ఏనుశబ్దప్రథమైకవచనముపై గసడదవాదేశమును కల్పించుకొనఁ జూచినారు.

ఇట్లు శ్రీసోమయాజులవారి ప్రయోగముల తత్త్వము నెఱుంగక వానింగూర్చి వెక్కురుగావించిన ప్రామాదికవ్యవస్థలు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతిచేత వానినెల్ల నిటం దడవనైతిని.

ఇట్టి యద్భుతములనుమాత్రము ఉద్దేశించి యొకయుపన్యాసము సేయందగును.

౩౧. అప్పకవి చెప్పినసప్తవిధకవులలో తిక్కన వివేకి యగును.

సీ. "గణ వర్ణ శబ్దార్థ గుణ దోష నికరంబు
పరికించి కూర్పఁ గబ్బము వివేకి." అప్పకవి.

ఆ నికరమునకు సాధనముగా,—

ఉ. "ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్రసం
పాదన లేమిచేఁ దెలుఁగుపలుకు మఱొక్కటి గూర్చి చెప్పఁగా
రా దని ధాతువాటికవిరాత్కుఁ డీనియమంబు చేసినన్." 6 పు.

క. "ఆమూఁడు పర్వములలో
సామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొని కృతుల్
తాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటి తెలుఁగు కవీంద్రుల్." 6 పు.

అని యప్పకవి పలికినాఁడు. ఇది సుప్తిఙంతరూప పదలక్షణపరమే గాని శబ్దమాత్రపరము గాదు. కవిసమయపరంబునుం గాదు. శబ్దమాత్రము లోకమువలన సిద్ధమని సర్వసమ్మతము. "ప్రవాహినీ దేశ్యా" యనుసూత్రంపు వివరణములో.—

క. "కవులకు దేశ్యము లోక
వ్యవహారమువలనఁ దెలియు నగు, నాలోక
వ్యవహారము నిత్యంబును
భువి నిజదేశమున యోగ్యమును నగుఁ గృష్ణా." 39 పు.

తే. "అవనియందు లోకవ్యవహార మనఁగ
నాత్మదేశంబులను బెద్ద లైనవార
లాడుభాషా విశేషవాక్యములలోన
వాడుకకు వచ్చునవి దగ్ధవార్ధిశయన." పు. 39.

అప్పకవి యీవిషయమును విస్పష్టము చేయలేదు. ఎట్లన నాతఁడు "అవి యెవ్వి యనిన" అని యారంభించి—చెవులు, బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్డు, ముడ్డి, కాళ్లు, అనఁగూడ దనియు, వీనికి బదులుగా— వీనులు, కన్నుదోయి, చెక్కులు పలువరుస, చన్నుఁగవ, పొక్కిలి, పిఱుఁదు, అడుగులు—అనవలయు ననియు వక్కాణించినాఁడు. ఇట్లితఁడు కూడ వన్నశబ్దము లన్నియు పెద్దలు వాడునవియే. కూడు నన్నవి అంత వాడుకలోనివి గావు.

పిల్లవానికి వీనులు కుట్టినారా? కన్నుదోయికి కలఁక వచ్చినది. పిఱుఁదు గడుగు, చనుఁగవబిడ్డ, పొక్కిలి కోసినారు, అను పెద్దలు లేరు గాని, చెవిపోటు, చంటిబిడ్డ, బొడ్డు కోసినారు, అని పెద్దలును వ్యవహరింతురు. "కవులకుఁ జెవులపండువులు నేయు" "పం డ్లిగిలించుకల్పకశాఖి," "బొడ్డు కోసినకొడవలి" అని మహాకవులును బ్రయోగింతురు. "పండ్లసరియలు" మనుచ. 4 (60), "బొమల్ ముడిగొనఁ బండ్లు గీటుచును" ప్ర. రా. వే. వి. వి. 84; "పండ్లు గన్పట్టంగఁ బనసఁ జూపుచు(?) ముష్టిఁ గైకొనుకులధరాగ్రణులఁ దెగడి," కువల. 1 (53), "పటుచపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి పూపొర్కువదనంబు బోసి పుచ్చె." కాశీ. 7 (84).

మఱి యిట వ్యవస్థ యేమన్న—సుభగవర్ణ్యనిర్దేశమున పూర్వోక్తములు ప్రశస్తములు గావు, తత్పర్యాయములుగా అనంతరోక్తములు ప్రయోక్తవ్యములు. ఈమదిరాక్ష్యాది సీసపద్యము కవిసమయసిద్ధపదపరము, శబ్దమాత్రపరము గాదు. కవిరాక్షసోక్తి పదలక్షణపరము.

ఆంధ్రకవితాగురు వయిన శ్రీనన్నపార్యునిలక్షణమును తిక్కనయెఱ్ఱనలు సమగ్రముగా పాటించినందుననే ఆయనతోఁగూడ వీ రిరువురును కవిత్రయసంకేతవాచ్యు లయినవారు.

3౨. శబ్దసమృద్ధి:—నన్నయగ్రంథముకన్న తిక్కనగ్రంథము అతిబహుళ మగుటచే దాన లేనియాంధ్రపదములు పెక్కులు ఇందుం గలవు. శబ్దతల్లక్షణసమృద్ధిసౌష్ఠవములచే భారతము కవులకు నిఘంటువును శబ్దశాస్త్రమును అయినది. అనంతరకవులు దానిని గ్రుడ్డిపాఠము గావించిరి. కవులప్రామాణ్య ప్రాశస్త్యములు తత్తద్భారతజ్ఞానతారతమ్యాధీనములుగా నుండును.

ఖరబుజినపల్లి సీతారామాచార్యులవారు నన్న తిక్క శంభుదాస సోములను ఆంధ్రకవులలో మొదటితరగతి వారినిగా గణించియున్నారు. ఇందు ఆంధ్రపండిత లోకము తొలిముువ్వురను కవిత్రయ మని సంకేతించి వారిప్రయోగమునే ముఖ్య ప్రమాణముగాఁ గొనుట సంప్రదాయ మైయున్నది.

## 33. నన్నయ తిక్కనాదుల తారతమ్యము.—

వీరిలో తారతమ్య మేర్పఱుచుట సుకరము గాదు. వీరిలో నన్నయ పాణినీయముచే సాధ్యము గాక వ్యాకరణాంతరముచే సాధ్యమగు "ముష్టాముష్టి" ప్రయోగముం గావించినాఁడు.—

క. "భీమాసురవీరులకు। ష్టాముష్టిరణచ్ఛటచ్ఛటా శబ్దం బు
ద్దామం బై తద్విపినము। హామృగపక్షులకు నతిభయావహ మయ్యెన్."

పాణినీయముప్రకారము "ముష్టీముష్టి" అనియే యుండవలయును. "ముష్టాముష్టి" బోపదేవకృతముగ్ధబోధసాధ్యము. ఎట్లన—

"349 వ్యతీహారే చిః పూర్వో ఘ్నోఽన చ్వా వా" అని సూత్రము. అందుల వృత్తి—"వ్యతీహారే యో హః తస్మాత్ చిః స్యాత్ పూర్వస్య చ ఘ్నః స్యాత్ ఆ వా న త్వచి। కేశేషు కేశేషు గృహీత్వా య ద్యుద్ధం ప్రవృత్తం కేశా కేశి। దణ్డైశ్చ దణ్డైశ్చ ప్రహృత్య య ద్యుద్ధం ప్రవృత్తం దణ్డాదణ్డి।

ముష్టా ముష్టి ముష్టీముష్టి, బాహోబాహి బాహాబాహవి। అచి తు అన్యని."

అందులకే శ్రీరామతర్కవాగీశటీకలో "ముష్టాముష్టీతి। పరే తు పూర్వస్యాత్వం నేచ్ఛన్తి। తేషాం మతే తు ముష్టీముష్టీత్యేవ।"

ఈబోపదేవునిచేత ఇంద్రాదివ్యాకర్తలు ఎనమండ్రు ప్రమాణీకృతులు.

"ఇన్ద్ర శ్చన్ద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః
పాణి న్యమరజైనేన్ద్రా జయ న్త్య ష్టాదిశాబ్దికాః."

"మతాని తేషా మాలోచ్య సర్వసాధారణః స్ఫుటః
ధాతుపాఠః స్వాదా ద్యాదిక్రమోఽదన్తాదాదిక్రమః
కవికల్పద్రుమో నామ పద్యై ర్నిష్పాద్యతేఽత్ర తు,
ధాతవః కథితాః పాఠ సూత్ర లో కాగమస్థితాః."

దానిటీకలో అత్మనేపదపరస్మైపదవ్యవస్థలో—

"తథాచవర్ధమానః...
'ఇతి లౌకికవాక్యేషు వ్యభిచారోఽతిపుష్కలః,

వేదవాక్యేషు య ద్వ్యస్తి నియమః కేన ధార్యతే ;
విశేషః పాణినే రిష్టః, సామాన్యం చిత్రవర్మణః,
సామాన్య మనుగృహ్ణాతి త త్రాచార్యపరమ్పరా.'

ఇతి. ఏతేన 'అకరో దచిరేశ్వరః క్షితౌ । ద్విషదారమ్భఫలాని భస్మసాత్' ఇతి రఘుః । 'తనోతి శుభ్రం గుణసంపదా యశః' ఇత్యాదౌ ఫలవత్కర్తరి పరస్మైపదమ్ । 'ఫలం విశోధ్య కారాయ దత్తే పర్వణి పర్వణీ' తి । 'కమలవనోద్ఘాటనం కుర్వతే యే' । యే సూర్యశ్మయః । ఇత్యాదా వఫలవత్కర్త ర్యాత్మనేపదమ్ ।"

ఇట్టిచిక్కులు తిక్కన భాగమున లేవు. ఇట్టివి నన్నయభాగమున ఇంకనుం గలవు. ఇందువలన నన్నయకు "వాగనుశాసన" "సకల భాషా వాగనుశాసన" బిరుదములు రూఢి కెక్కుచున్నవి. వీరలనుగుఱించి మహనీయులు వచించినసూక్తుల నరయుట తగును.

## ౩౮. నన్నయ కృతాత్మ ప్రశంస.

సీ. "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ । జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది । నానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర । జాతు సద్విసుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి । శోభితు సత్ప్రతిభాభియోగ్యు.

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా । చార్యునుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా । భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ."
('తనుఁ గుల'—పా.)

ఉ. "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా, నితరు లక్షరరమ్యత నాదరింప, నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుఁగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."
[ఇతరులు=శాబ్దికాదులు.]

ఆశ్వాసాంతమున—"ఇతి శ్రీ సకలభాషా వాగనుశాసన నన్నయభట్ట ప్రణీతం బయిన..." అని వ్రాసికొనియున్నాఁడు. పైసీసపద్యములోని "విపుల" శబ్దము ఈగద్యమందలి "సకల" శబ్దమునకు పర్యాయముగా నుండనోవు,

౩౫. నన్నయంగూర్చి యెఱ్ఱన (క్రీ. శ. 1369) అరణ్యపర్వాంతమున:—

తే. "ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ
డైననన్నయభట్టి మహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి."

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంత దోఁపఁ, దద్రచనయకా,
నారణ్య పర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణ పుటపేయముగాన్."

అని వచించినాఁడు. ఇందువలన నన్నయయందు ఎఱ్ఱన వహించినగౌరవాతిశయము తేటపడుచున్నది.

౩౬. ఎఱ్ఱన తనహరివంశములో నన్నయతిక్కనల నిట్లుగ్గడించినాఁడు.

ఉ. "ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము సుద్ధతాన్యపరిభావి మదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయసూచితంబు నయి యొప్పెడునన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్."

మ. "తనకావించినసృష్టి తక్కొరులచేతం గాదు నా, నేముఖం
బునఁ దాఁ బల్కినఁ బల్కు లాగమము లై పొల్పొందునా, వాణి న
త్తను నీతం డొకరుండ నాఁ, జనుమహత్త్వాప్తిం గవిబ్రహ్మ నా,
వినుతింతుం గవిఁ దిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్."

ఇందు నన్నయతిక్కనలకు హస్తిబ్రహ్మాంతర మని యెఱ్ఱన భావించినట్లు కొందఱభిప్రాయపడిరి. కాని వక్ష్యమాణముచే నయ్యభిప్రాయము తొలఁగఁగలదు. ఏలన-ఎఱ్ఱనయే వీరింగూర్చి తనలక్ష్మీనృసింహపురాణమున:—

ఉ. "భాసురభారతార్థములభంగులనిక్క మెఱుంగ నేరమిం
గాసటబీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లము చేసినట్టియ
బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్."

ఇట్లు ఇరువురను బ్రహ్మతుల్యులంగా వచించినాఁడు.

౩౭. మహనీయుఁడు తిక్కనసోమయాజి (క్రీ.శ. 1275) విరాటపర్వారంభ ములలో నన్నయ్య నిట్లుద్దేశించినాఁడు:—

ఉ. "ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెను పొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

ఉ. "కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావళి మోదమున్ బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదం బయినచిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యముల న్రచియించెద న్గృతుల్."

"మదమాతంగతురంగ" పద్యమునకు పసరు మెఱుఁగు పెట్టుటచేత తిక్కన "నన్నయకన్న మెఱుఁగుగా నల్ల శక్యము గాదు, మెఱుఁగువోలెఁ దోఁపింపఁ జేసెదను." అనునభిప్రాయముం దెలిపె నని పెద్దలు వచింతురు.

౩౮. బి. సీతారామాచార్యులవారిచే 2-వ తరగతిలోఁ జేర్పఁబడినవాఁడు తిక్కనశిష్యుఁడు మారన నన్నయను ఆంధ్రకవితాగురువుంగాఁ గొలుచుచున్నాఁడు. తనగురునిఁ దిక్కనను ఆంధ్రకవితాగురు వని చెప్పలేదు.

ఉ. "సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మును త్రిపర్వము నెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్."

చ. "ఉభయకవిత్వతత్త్వ విభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాక్రియా
విభుఁ బరతత్త్వబోధను నవీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీశ్వరుఁ గొల్తు భక్తితోన్."

"ఇది శ్రీమదుభయకవిమిత్ర తిక్కనసోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్రమారయామాత్య ప్రణీతం బైనమార్కండేయపురాణంబునందు."

౩౯. బి. సీతారామాచార్యులవారు 2-వ తరగతిం జేర్చిన శ్రీనాథకవి (క్రీ.శ. 1370) భీమేశ్వరపురాణమున.—

క. "నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠ గాఢప్రతిభున్."

ఉ. "పంచమవేద మై పరఁగుభారతసంహిత నాంధ్రభాషఁ గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్."

అని నన్నయను ఆంధ్రకవితాగురువునుగా వచించినాఁడు, తిక్కనను ఈ పంచమవేదమున బంహిష్ఠభాగము నాంధ్రీకరించినందులకు కాంచనగర్భతుల్యుఁ డని యుగ్గడించినాఁడు.

ఇతఁడే వారివారికవనగుణవిశేషములం జెప్పుచు కాశీఖండమున.—

సీ. "వచియింతు వేములవాడభీమునిభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు,
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు,
నాక్రమింతు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధమునఁ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు."

అని నన్నయకు ఉభయవాక్ప్రౌఢియు తిక్కయజ్వకు రసాభ్యుచితరచనయు ప్రధానగుణములుగా వర్ణించినాఁడు. ఏతత్సమార్థకముగా నే వెండియు నంపే—

తే. "శబ్దశాసను నన్నపాచార్యవర్యు
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు
నధికతరభక్తిసంయుక్తి నాదరించి."

అని నన్నయను ఆచార్యవర్యుఁగాను, తిక్కనను ఉత్తమకవిఁగానుం, బలికి నాఁడు.

౪౦. ఎఱ్ఱన (క్రీ. శ. 1400) 3-వ తరగతికవి. కవిత్రయము నిట్లు నుతించి నాఁడు.—

ఉ. "వేయువిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పి రిట్లు రసబంధురవాగ్విభవాభిరామధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రసిద్ధి కెక్కెరే
యేయెడ నన్నపార్యుగతి! నిద్ధర నట్టిమహాత్ముఁ గొల్చెదన్."

మ. "పరువడి భారతాఖ్యఁ గలపంచమవేదము నాంధ్రభాష ను
స్థిరత రచించుచోఁ గృతిపతిత్వముఁ గోరి ప్రసన్నుఁడై నయా
హరిహరనాథుచేఁ బడసె నవ్యయసౌఖ్యపదంబు నెవ్వఁడా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్."

ఉ. "ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్ర నరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరాము చా
రిత్రములున్ బుధవ్రజగరిష్ఠత నెఱ్ఱయశంభుదాసుఁ డా
చిత్రికవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్."

అని నన్నయయందు శబ్దశుద్ధిని, రసబంధురవాక్కును, ఎఱ్ఱనయందు శబ్దవైచిత్రిని వచించినాఁడు. శ్రీనాథుండును ఎఱ్ఱనకు సూక్తివైచిత్రినే చెప్పినాఁడు.

౪౧. పిల్లలమఱ్ఱి పినవీరభద్రన (క్రీ. శ. 1450) 3-వ తరగతికవి—శకుంతలా పరిణయమున.—

క. "ఇట్టుల మగుమతి భారత ।
ఘట్టమునకు నడవయచ్చు కట్టినకవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్." 1 (11).

తే. "ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు,
భానుసమతేజుఁ, గొమ్మయప్రభుతనూజు,
సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ,
బ్రణతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి." 1 (12).

అని నన్నయయందు కవితాగురుత్వమును, తిక్కనయందు కవనసౌభాగ్యమును, ప్రస్తుతించినాఁడు.

౪౨. నందిమల్లయ్య ఘంటసింగయ్యలు (క్రీ. శ. 1475), వరాహపురాణము.

తే. "నన్నపాచార్యునకు వందనంబు చేసి
తిక్కయజ్వకు మ్రొక్కి కీర్తితము వైన
శంభుదాసునివాగ్విలాసములు నెమ్మ
నంబులోపల నిలిపి, శ్రీనాథుఁ బొగడి."

ఇచట గురునికి వందనంబును, పూజ్యునికి మ్రొక్కును, విలాసములను హృదయమం దుంచుకొనుటయుఁ గన్పట్టుచున్నవి. ఎఱ్ఱనవాక్యముచే తిక్కనయందు బ్రహ్మత్వమును నన్నయయందు కుంజరత్వమును తారతమ్యార్థమై గ్రహించిన యట్టి రసికులకుం బ్రతిగా—ఇచట ఈ జంటకవులు నన్నయకు సంస్కృత భూయిష్ఠతంబట్టి సంస్కృతమున వందనమును తిక్కనకు తెలుఁగుబలిమిం బట్టి తెలుఁగుగా మ్రొక్కును, సమర్పించి, విలాసములను విలాసములు గావున మనంబున నిలుపుకొని రని చమత్కారపరులు స్వారస్యము పలుకవచ్చును.

౪౩. కుమారధూర్జటి (క్రీ. శ. 1550) 5-వతరగతికవి, కృష్ణరాజవిజయమున.

సీ. "వాక్ఛాసనుం డనువాని నిజంబుగా
నలబ్రహ్మదేవుఁడే యని నుతింతు ।
కుండలీంద్రసమాఖ్యఁ గొమరొందుకవిచంద్రు,
నను వొందశేషాహి యని తలంతు ।
శ్రీనాథవిఖ్యాతిఁ జెన్నొందుబుధవర్యుఁ,
బురుషోత్తముఁ డటంచు బుజ్జగింతు ।
ధూర్జటిప్రౌఢిచే నూర్జితుం డగువాని,
సాక్షాచ్ఛివుం డని సంస్మరింతు."

౪౪. భట్టుమూర్తి (క్రీ. శ. 1560) 3-వ తరగతికవి—వసుచరిత్రలో,

మ. "మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం, గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ, శ్రీనాథుండు బ్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్, సొంపు వాటించునీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్."

అని నన్నయకు ఆంధ్రకవితాగురుత్వమును, తిక్కయజ్వకు తన్మార్గ ప్రతిష్ఠాపనమ్ము వచించినాఁడు.

౪౫. చెదలువాడమల్లయ్య (క్రీ. శ. 1580), విప్రనారాయణచరిత్రలో.—

ఉ. "ధారఁ జెలంగి, నిత్యపరితర్పితరాజరసజ్ఞమై, యసా
ధారణ భారతోద్ధృతపదంబుల మించి, నిరంతరక్షణా
ధార మహామహత్త్వ సహితం బగు నన్నయభట్టభారతీ
సారసుధారసంబు బుధసంస్తవనీయము గాక యుండునే."

క. "ప్రాకటనవరసకలనా । సాకల్యము మెఱయ మధురసమధుద్రాక్షా
పాకప్రబంధరచనన్ । జోకం జను తిక్కయాయజూకుం దలఁతున్."

అని నన్నయకవనము అమరత్వప్రదమును లోకోత్తరము ననియు, తిక్కన కవనము లలిత మనియు తెలిపినాఁడు.

౪౬. గణపవరపువేంకటకవి (క్రీ. శ. 1700) ప్ర. రా. వే. వి. వి. నందు—

సీ. "అలనన్నకోటపెద్దన లక్షణజ్ఞత, । శబ్దశాసనకవిశబ్దశుద్ధి,
ప్రాబంధికపరమేశ్వరునర్థమహిమంబు । యకమిత్రుని పదలలితత,
శ్రీనాథువార్తాప్రసిద్ధి, నాచనసోము । భూరికాఠిన్యంబు, పోతరాజు,
యమకవిధము, మల్లనమనీషిచిత్రంబు, । పింగళిసూరకవివరుశ్లేష,

తే. యాంధ్రకవితాపితామహు నల్లికబిగి,
ముక్కుతిమ్మన తేటయు, భూషణుని య
లంకృతియును, నీకె కలదోఁ దలంప లక్ష
ణకవియప్పయవేంకటసుకవిచంద్ర."

అని నన్నయశబ్దశుద్ధిని, తిక్కన పదలాలిత్యమును, చెప్పినాఁడు.

౪౭. రోసనూరి వేంకటపతి (క్రీ. శ. 1690) విష్ణుమాయావిలాసమున.—

ఉ. "వాగనుశాసనప్రకటవర్ణవినిర్ణయ మేర్పడన్ సము
ద్యోగకవిప్రయోగముల కొప్పుచు నొప్పఁగ నాంధ్రభాషకున్
దా గురు వై యొనర్చె వినుతస్థితి లక్షణలక్ష్యముల్ తదిం
ద్రాగసమాను లోకహితు నాద్యుని నన్నకవి న్నుతించెదన్."

ఉ. "వ్యాసవచస్తరంగ బహుశాస్త్రజలగ్రహభారతాబ్ధి మేల్
వాసిగఁ బారముం గనఁ దలంచియు సద్గురుభక్తి గల్గ న
భ్యాస కవిత్వమార్గగమనాధి(వి?)కుఁ డై తగుతిక్కయజ్వ భా
షాసముదాత్త శంభుపదసారసషట్పదచిత్తుఁ గొల్చెదన్."

అని నన్నయను ఆంధ్రభాషాగురు వనియు తదీయభారతభాగమును శబ్దలక్షణమనియు వచించినాఁడు. అభ్యాసాదిసమాసముచే తిక్కనను ఆశుకవి యని సూచింపంబోలును.

## ఇందుల సారాంశము.

| కవి. | నన్నయ—విశేషణము. | తిక్కన—విశేషణము. |
|---|---|---|
| నన్నయ. | విపులశబ్దశాసను | |
| | సకలభాషావాగనుశాసన | |
| ఎఱ్ఱన. | నన్నయభట్ట మహాకవీంద్రు | |
| | సరససారస్వత | |
| | నన్నయభట్టు కుంజరంబు | కవిబ్రహ్మ |
| | అజ్ఞాసన కల్పుఁడు | అజ్ఞాసనకల్పుఁడు |
| తిక్కన. | ఆంధ్రకవిత్వ విశారదుండు | |
| | విద్యాదయితుండు | |
| | దక్షత | |
| మారన. | ఆంధ్రకవితాగురు | ఉభయకవిత్వతత్త్వ విభవోజ్జ్వలు |
| శ్రీనాథుఁడు. | ఉపాధ్యాయసార్వభౌముని | కాంచనగర్భతుల్యునకు |
| | కవితాపట్టాభిషిక్తు | |
| | ఉభయవాక్ప్రౌఢి | రసాభ్యుచితబంధము |
| | శబ్దశాసను | |
| | ఆచార్యవర్యు | సత్కవిశ్రేష్ఠు |
| చిక్కన. | రసబంధురవాగ్విభవాబ్ధి | |
| | శామధౌరేయుఁడు | పురుషవరేణ్యు |
| | శబ్దశాసనవరేణ్యుఁడు | |
| పినవీరన. | కవితాపట్టాభిషక్తు | ప్రణతబహుదేశకవిరాజి |
| | ఉపాధ్యాయు | |
| సం. మల్ల. గం. సింగ. | ఆచార్యునకు | యజ్వకు |
| కుమార ధూర్జటి. | వాక్శాసనుండు | |
| | బ్రహ్మదేవుఁడే | శేషాహి |
| బట్టుమూర్తి | సృజియింపఁగా | స్థితిమూలము |
| | వాగనుశాసనుండు | |

| | | |
|---|---|---|
| చెదల. మల్లయ | నన్నయభట్టభారతీ సారసుధారసంబు | నవరసకలనాసాకల్య [బంధ మధురసమధుద్రాక్షా పాకప్ర పఫలలితత |
| గణ. వేంక | శబ్దశాసనకవి శబ్దశుద్ధి | |
| రోస. వేంక | ఆంధ్రభాషకుఁ దా గురువు లక్ష్యలక్షణకర్త ఆద్యుని. | అభ్యాసకవిత్వ మార్గగమ నావికుఁడు |

ఇట్లు బహుకవీంద్రాభిప్రాయములను సమాహరింపఁగా రూఢికెక్కిన దేమన.- కోవిదత్వ కవిత్వ వైదగ్ధ్యములందు నన్నయ అప్రతిముఁడు. శబ్దశుద్ధికి ప్రథముఁడు, ఆంధ్రకవితా గురువు. లక్షణముం దెట్లో సకలవిషయములందును నన్నయ తిక్కన శంభుదాస (సోములు) యథాపూర్వము శ్రేయస్తరులు. అందఱిలోను తిక్కన లలితతముఁడు.

## ౪౮. నాచనసోమన.

ఆధునికులు కొందఱు సోమనను కడమ ముప్వురకన్న నధికునిగా తలంచినారు. బాలవ్యాకరణకర్త అతనిని గూర్చి—

క. "ఘను నన్నయభట్టును ది । క్కన, నెఱ్ఱాప్రగడఁ బొగడి, యలికంబున య
   క్షిని డాఁచినట్టి సర్వ । జ్ఞుని నాచనసోమనాథు, స్తుతి యొనరింతున్."

అని తనమదిం దెలిపినాఁడు. బ. సీతారామాచార్యులవారు ఇతని మహిమకుం దార్కాణముగా అపూర్వపదఖచిత మయిన యీక్రింది యీతనిహరివంశ పద్యమును ఉదాహరించినారు.—

సీ. "వంకదారకుఁ జేరి, వాకిటిదద్దడం । బులు నెర్చి కొమ్ముల మోకు వైచి,
   ప్రాఁకి లోపలఁ జొచ్చి, పలుగాఁడిఁదెఱచిన । పంతకాడ్లను మున్న ప్రద్దపరుల
   తోన నిచ్చెన లెక్కి, దోనికొత్తళములోఁ । బురణించి, చొచ్చినపోటుమగల
   వాఁడి మెచ్చక, యాడువరిమీఁదఁ బాళెల । వారిఁ దాఁకించిన, వానిబిరుదు

తే. లచ్చెరువు లొంద మేడలు సొచ్చి యార్చు
   దొడ్డకాడ్లచేఁ బడిపోయెఁ దూర్పుదిక్కు,
   ఆలవాటుల నేటుల అంతు మిగిలి
   తఱిమి రచ్చటిబలముఁ గొందఱు గడంగి." ౩ (౩౩).

ఇట్లు అపూర్వపదములను గుప్పించుటచేత కడమవారికన్న నితఁడే అధికుఁడని నేఁ దలంపను గాని, ఉత్తరహరివంశమందలి కవనగుణములు పెక్కింటిచేత ఈయన వాస్త

వముగా ఉత్కృష్టకవియే. ఈయనకవనము కఠిన మని గణపవరపు వేంకటకవి వచించినాఁడుగదా. ఈయన నన్నయ తిక్కనలకన్నం బండితుం డనుటకు నిదర్శనము లేదు. ఈతని ప్రౌఢికి తార్కాణము లైనపద్యములను—

సీ. "అభ్రంకషం బైనయాలఁబోతు నితండు । త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు,
సాధుసమ్మతముగా సామజంబు నితండు । గాచెనాఁ డీతండు ద్రోచినాఁడు,
బర్హిర్ముఖార్థ మై పర్వతేశు నితండు । దాల్చెనాఁ డీతండు వ్రాల్చినాఁడు,
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు । మెట్టెనాఁ డీతండు చుట్టినాఁడు.

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పఁగఁ జెప్పంగఁ జూపఁ గలిగె,
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు." 2 (180).

పర్వతేశు=(1) మందరమును, (2) కైలాసమును. నేఁడు చూప ౧-౪ పాదములందు, నాఁడు చెప్ప ౨-౩ పాదములందు, అని చమత్కారము.

సీ. "సారసంబున లేవ నీరసంబునఁ జావఁ । బద్మాసనుఁడు వీరిపాలఁ గనియె,
రూపుగంటఁ జెలంగఁ జూపుమంట నలంగఁ । బంచబాణుఁడు వీరిపాలఁ గనియె,
వరములు వడయంగ శిరములు గెడయంగఁ । బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె,
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప । బాణాసురుఁడు వీరిపాలఁ గనియె,

తే. గనియె చిత్రంబులకు వీరు గలసి యుండి
మనుపఁ జెఱుపంగఁ జెఱుపంగ మనుప నేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట
హరిహరాత్మ నెఱింగితి మనిరి సురలు" 2 (181).

సీ. "కుజము కుంజరముచేఁ గూలునో కూలదో?
కూలుఁ, గుంజరము నీకుజము గూల్చె;
మ్రాను పేరేటిచే మడఁగునో మడఁగదో?
మడఁగుఁ, బేరేటి నీమ్రాను మడఁచెఁ;
గాలునో యొకనిచేఁ గాలదో సాలంబు?
గాలు, నీసాలంబు గాల్చె నొకనిఁ;
దునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు?
తునియు, నీవృక్షంబు తునిమెఁ బరశు;

తే. నసుచుఁ దములోనఁ జర్చించుసమరవరుల
కభిమతార్థ ఫలార్థమై యుండ వచ్చు
పారిజాతంబు నాశ్రమోలఁ బండియుండ
నంద గంటె నాకోర్కుల నందఁ గంటె." 2 (176.)

ఇత్యాదులను కొందఱు కష్టకల్పన లనిరి. ప్రతిభోన్మేష కృతములైన ప్రౌఢకల్పనలు గాని సులువుగా నల్ల లేక చెఱఁగొట్టు కొన్నవి గావు ఉత్కృష్టకల్పనలు, కరము మెచ్చఁదగినవి. ఈయన వివస్థంత యయ్యును లక్షణమందును లాలిత్యమందును తిక్కనను మించినవాఁడు కాఁడు. ఈయన చమత్కారపరుఁడు. తిక్కన వైదర్భిప్రియుఁడు, ఈయన గౌడీరసికుఁడు. అట్టి యీతని హృద్యకవనమునకు ఈ క్రింది పద్యముం బరికింపుఁడు.— [ఇది గౌడి మదావృత్తి గాదు.]

సీ. "సుడిగొన్న [1] చిఱురాకుజొంపంబు కెంపారఁ (1 జడలు)
దలమీఁద [2] మల్లికాదామ ముడఁచి, (2 గంగ)
నిడుద [3] తామరతూఁడు నెట్టెంబు చుట్టి. పైఁ (3 వాసుకి)
[4] బటికంపుఁ గడియంపుభాగ మదిమి, (4 చంద్రకళ)
తోన యాత్రోవఁ [5] గెందావరేకు హత్తించి, (5 తృతీయాక్షి)
మెడచక్కిఁ [6] గస్తూరి మెదిచి పూసి, (6 కాలకూటము)
పాయగొమ్మల [7] నల్లపట్టు దగిల్చి, య (7 గజాజినము)
[8] క్కనయాకుపై వెండికోర వెట్టి, (8 హస్తమున కపాలము)

తే. [9] ధవళకేతకధూళిగాత్రమునఁ జఱచి, (9 విభూతి)
[10] మోఁకమామిడి కొకకొంత మ్రొక్కి నిలిచి, (10 పరమశివుడు.)
యొడలిలోఁ జక్క సగము నా కొసఁగు మనుడు,
నద్రికన్యక తల వాంచె హరుఁడు నవ్వె."

ఆంధ్రవిద్యాధికారులు (అధిక+అరులు అని యీ భేదము) కొందఱు దీనిని అశ్లీలమని తొలఁగింప యత్నించిరి. దీనిని మించుపద్యము అరుదని మత్ప్రయత్నమున విశ్వనించి నిలిపిరి. ఈయనవలె తఱచుగా ప్రౌఢచమత్కారములు తిక్కన చూపమి—అతిమహత్తయిన యాభారతభాగము తనచేతనే ముగియునా యని యాందోళనపడుచు "మహాకవిత్వ దీక్షావిధి నొంది" త్వరపడుచు అతివేగముగా కవనముం జెప్పుచున్నందున నవకాశము లేమిచేత నని తలంపం దగును.

సోమనయు తనకు తిక్కనయందుఁ గలగౌరవమును తన యుత్తరహరివంశమును తిక్కనవలెనే హరిహరనాథునికి అంకితము సేయుటచేతను దాని యాశ్వా

సాంతగద్యముల నన్నింటను "ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతకథానంతరంబున శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ రచితం బైన యుత్తరహరివంశంబునందు" అని తదీయ సంకీర్తనంబు చేయుటచేతను సమగ్రముగా నిరూపించినాఁడు. తిక్కన రచనాప్రకారములనే యవలంబించి యీతఁడు రచించినకవనంబునకు ఒక కొన్ని యుదాహరణము లొసంగెద.—

## ౪౯. తిక్క-సోముల తారతమ్యము.

౧. ఉ. హ. 2 (27) (స్రగ్ధర).

గాండీ వారావ ఝంపా ఘటితభయ దివాకః పురాంతః పురంధ్రీ
గండాభోగ శ్రమాంభః కణ కలుషిత గంగా తరంగాభిషంగా
ఖండాస్మ త్కాండపాళీ కబళిత సకలాకాశ సీమా నిశాంతో
ద్దండాతిక్రాంత గర్భాంతక యమభటసంతానముం గాన నైతిన్.

ఉద్యోగ. 1 (323) (స్రగ్ధర.)

గాండీవజ్యారవం బుత్కటమయి వెలుచన్ గ్రమ్మినన్ భీమబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్, వే
దండద్వంద్వంబుమాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం, బా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టులిక్క మూర్ఛిల్లకుండన్.

[రెంటను ఆరంభము సదృశము.]

౨. ఉ. హ. 3 (27).

శా. వీరాగ్రేసరుఁ డేకలవ్యుఁడు ధను ర్విద్యానవద్యుండు దో
స్సారఖ్యాతి నరాతిరాజుల రణోత్సాహంబు దూరంబుగాఁ
బారావారవిహారమందరగిరి ప్రారంభ శుంభద్గతిం
దే రొప్పారఁగఁ బేరు వాడి కలఁచెన్ ధీరోద్ధతానీకమున్.

విరాట. 5 (11)

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణో ద్యోగానురక్తుండు దు
స్సాధ ప్రక్రమ బాహువీర్యుఁడు గురు ద్రోణాల వాల్లభ్య ల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలిత శ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్.

3. ఉ. హ. 4 (122,)

సీ. నరకాసుర ప్రాణనాళోత్తరణకేళి । రణకేళి వలకేలిరవముఁ జూపె,
కంసదానవ శిరఃకమల కృంతన । మేలు తనమేలుచేయి పెద్దలకు నొసఁగె,
చాణూరముష్టికక్షతజకీలాలంబు । లాలంబులో నెల్ల నలువు వఱపె,
మురహయగ్రీవాంత్రమూలఫేనావలి । నావలిఁ దలఁగఁ జీకాకు పఱిచెఁ;
తే. వీరరససారకాసార విహరణంబు ।
విష్ణునకు నొప్పు, నతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులమునింగ ।
పాఱ వెంపళ్లు తమ కెంతబంటి యనుట.

(విరాట. 4 210)

సీ. శక్రాదిసురులతో సంగ్రామ మొనరించి
ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె,
యాదవబల మెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ
గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె,
దిగ్విజయంబునఁ దేజంబు నేనె ని
కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె,
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ
గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె,
తే. అని నివాతకవచు లను దానవుల నాతఁ।డొక్కరుండ కాఁడె యుక్కుమడిఁచె,
నమరులకు నజేయు లగు కాలకేయుల।నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ?

ఇట నీ యుత్తరహరివంశపద్యమున ఈభారతపద్యములో లేనిది అనుప్రాసజట యొకటి హెచ్చు.

౪. ఉ. హ. 4 (187)

శా. నా కీతమ్ముఁడు ఖడ్గముం గలుగఁగా నాకేసుఁడు న్సాటియే?
లోకంబు ల్పదునాలుగు న్గెలుతుఁ; గల్లోలానిలాలోల వే
లాకూపారము పారముం గడియఁ జేయం జాలిన న్ద్వారకం
గైకొందు న్యదువృష్టి భోజనృప సంఘధ్వంసనాపాది నై.

ఉద్యోగ. 2 (295.)

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరు లేల? సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము; మాకు నీ

యర్ణవ వేష్టిత క్షితి యనర్గళ విక్రమ మొప్పఁ దక్కు; మా
నిర్ణయ మెల్ల నిట్టి; దవనీతియొ నీతియొ చూడుమీ తుదిన్.

గ. ఉ. హ. 4 (210).

సీ. శార్ఙ్గనందక సుదర్శన పాంచజన్యకౌ । మోదకీ కౌస్తుభములు వెలుంగఁ,
పీతాంబరము గట్టి పెంపొందు హా కాలఁ । బెట్టి సన్నద్ధుఁడై, పేరురమునఁ
బద్మమాలిక గ్రాల, బద్ధగోధాంగుళి । త్రాణుఁడై, వంది బృంద స్తవములు
భూసురాశీర్వాదములు మించి నంటంగ, । బలభద్రసాత్యకి ప్రభృతు లెల్లఁ
తే. జేరి నడతేర, నరదంబు డారుకుండు
గడప, యాదవసైన్యసాగరము వొంగ,
గరిమఁ బొడతెంచు నిందుపంకరుఁడుపోలె
రుచిరమూర్తి యై నీలవర్ణుండు వచ్చె.

ఉద్యోగ. 4 (125).

సీ. వక్షఃస్థలంబున వనమాల గ్రాలంగ । వెలిమావు గెరల వాగెలు ధరించి,
నొగలపై హరి యొప్ప, నగచరకేతువు । మెఱయంగ, నరదంబు మెఱుఁగు లడర,
దివ్యకిరీటంబు దీప్తులు భూనభో । తర మెల్లఁ గలయంగఁ బరఁగుచుండ,
గాండీవతూణయుగ్మములు పూర్వాపర । భాగంబులకు నవాభరణములుగఁ,
తే. దెలిమొగంబుతో నల్ల నేతెంచి యెక్కి
పార్శ్వమునఁ బొసనూపి భూపతికి మ్రొక్కి,
దేవదత్తంబు పూరించె దేవదేవు
పాంచజన్యంబు మున్నుగా ఫల్గునుండు.

ఉ. ఉ. హ. 4 (212).

సీ. పడఁకుపన్నగరాజుపడగలమీఁద । సర్వంసహాకాంత పేరణము సూప,
నుజ్జ్వలత లూఁగెడునుదయాస్తగిరులచే । నాకాశలక్ష్మి కోలాటమాడఁ,
దెరలెత్తి సప్తసాగరములు బొరలంగ । వరుణుండు గొండిలి పరిఢవింప,
మొకములచాయ వేఱొకచందముగ నిల్చి । కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప,
తే. కుంగలములలోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ పడ, దిక్కు లెనిమిదియును
జగులఁ దాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్యరవము.

ఉద్యోగ. 4 (116).

సీ. బీఱెండ తాఁకున బీఁటలు వాఱిన । పచ్చిగోడలమాడ్కిఁ జగిలె దిశలు,
కాఁగిన యెసరులకరణిఁ బొరింబొరి । శరనిధు లుబ్బొంగి పొరలఁబడియెఁ,
గలము పైఁ గీలించి గాలి కెత్తినచాఁప । వోలె మిన్నంతయు బూరటిల్లెఁ,
గులపర్వతావళి గులిశభయంబున । బెదరి వాపోవున ట్లెదురు నెలఁగె,

తే. ధాత్రి కుమ్మరిసారె విధమునఁ దిరిగె, । జిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు
లయ్యె సర్వభూతములుఁ, బ్రయాణభేరి । భూరినిష్ఠురఘోరభాంకార మడరి.

ఇటు ఈ భారతపద్యములో లేనిది నాట్యమొకటి ఉ. హ. పద్యములో ఎక్కువ।

౭. ఉ. హ. 4 (219).

సీ. కరటి ఘటాకోటి కటనిర్గళన్మదా । సారంబు తొలుకారుఁ జేరఁ బిలువ,
రథనేమి నిర్భిన్నపృథివీపరాగంబు । నీహారసమయంబు నేర్పుఁ దెగడ,
సుభటభుజోద్భటచ్ఛురికా ప్రభాభంగి । మండువేసవితోడ మాటలాడఁ,
దురగఘట్టఖలీనధుతఫేనతారకా । వళి శరత్కాలంబువరుసఁ జూపఁ

తే. బవన చంచల ధ్వజపటపల్లవములు । నవవసంతంబుఁ దెలుప, సన్నాహతరళ
ఖడ్గలతికలు శిశిరంపుఁగడఁకనెఱప, । హంసడిచికులసేన యోఁడనఁగ నడిచె.

విరాట. 4 (50)

సీ. అభినవజలధరశ్యామంబు లగునెడ । లాకుజొంపంబుల ననుకరింప,
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లు। కిసలయోత్కరములఁ గ్రేణిసేయ,
రాజమరాళగౌరము లగుచోటులు । దఱచుఁబూఁబొదలచందంబు నొంద,
హరిద్రరుచిసమానాకృతు లగుతావు । లడరెడుపుప్పొడులట్లు మెఱయఁ,

తే గలయ నెగసి ధరాధూళిలలితవనము
దివికి నలిఁ గాపు వోయెడు తెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ, నేల గోడివడఁగ,
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనిమె.

ఈసామ్యతారతమ్య ప్రదర్శనమును గ్రంథవిస్తరభయముచే నింతటు విరమించెద. విస్తరము ఆకరాంతరములయందుం గననగు. సోమనకవనము తిక్కన వరువడిం బట్టియే వ్రాసిన దైనను దానిని మించుటకే యుంకించుచున్నను, పెక్కుకారణములచేత దానికి కొండికయనియే చెప్పవలసినదై యున్నది.

౫౦. తిక్కన తన భారతభాగమును తాను నెల్లూర హరిహరనాథస్వామి యాలయములో తెరమఱుఁగునను కూర్చుండి వ్రాఁత చెప్పుటగాను, కుమ్మరగురునాథుఁడు వ్రాయుటగాను, నెఱవేర్చె ననియు,—యుద్ధవర్ణనలో సంజయుఁడు ధృతరాష్ట్రునింగూర్చి "ఏమి చెప్పుదుఁ గురునాథ" అని పల్కినవాక్యమును లేఖరి గురునాథుఁడు తన్నుఁగూర్చి సోమయాజి పలికె నని భ్రమపడినందునను అంతకుముందే తెరలో యుద్ధము జరుగుచుండినట్లు తనకుం దోఁచుచుండినందునను, వ్రాఁత నిలిపి, తెర కొంచె మెత్తి తొంగి చూడఁగా, తెరలోని యవకాశము శర శర జ్వాలామయముగా నగపడి, అం దొకశరము అతని కంటికిం గ్రుచ్చుకొనియె ననియు, అంత నతఁడు తెరను ఎప్పటియట్లు వదలి, కంటిలోని యాయలుఁగును ఊడఁబెఱికికొని, కుదురుపడి, అనంతరభాగమును వ్రాసి, పిమ్మట ఆనష్టభాగమును తనజ్ఞప్తిచే పూర్తి చేసె ననియు—కింవదంతి సుప్రసిద్ధము.

గుడియందు రచించె ననుటకు విరాటపర్వారంభములోని యీక్రింది తిక్కనవాక్యము చేయూఁత యిచ్చుచున్నదా యనిన, ఇందు ఉక్తము దేవసన్నిధిసామాన్యమే గాని అర్చావిగ్రహసన్నిధిరూప మయిన సన్నిధివిశేషము గాదు.—ఆ వాక్య మిదిగో—"అని పూని యీదృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి."

ఏతదవిరోధముగా కొందఱు ఇదానీంతనులు అట్టియాలయమే ఎన్నఁడును లేదనియును, తిక్కన పరతత్త్వమును హరిహరనాథరూపమున ధ్యానించి గ్రంథమును రచించెను గాని, అర్చావిగ్రహసన్నిధిలో రచియింప లే దనియు, చెప్పుదురు.

అయినను, కింవదంతిప్రకారము అట్టిదేవళమే పూర్వ ముండినపక్షమందును ఆదేవళములోనే ఆయన రచించెనా యనుప్రశ్నకు నుత్తరమును 'దేవళములో రచింపలే' దని తిక్కనయే యీక్రిందివాక్యముచే తెలిపినాఁడు:—

"...(హరిహరనాథునకు...పరతంత్రునకుఁ) ఏను విన్నపంబు నేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబునర్థంబు సంగతంబు సేసెద." ఇటం గవి హరిహరనాథరూప దేవసన్నిధిని మానసమునందుఁ గల్పించుకొని రచించితి నని వక్కాణించినాఁడు. [అంతః=మానసిక, కల్పించుకొని=భావించుకొని. అంతస్సన్నిధిం గలిగించుకొని=మానసమున తత్సన్నిధిని భావించుకొని.] అంతస్సన్నిధి యనుటచే బాహ్యసన్నిధి గాదు, అనఁగా గుడి గాదు, అర్చావిగ్రహసన్నిధి గాదు, అనుట స్పష్టము.

ఇట్టి యీకవిత్రయమార్గమున సాహసింప లేక యనంతరకవులు లఘుతరప్రబంధములను పూనుకొని తమతమ పాండిత్యవైదగ్ధ్యములను సమగ్రముగా చూపుకొనుటకు అవకాశము కల్పించుకొని అష్టాదశవర్ణనాత్మకము లగుప్రబంధముల నల్లం జొడంగినారు; తుదకు పాడిన పాటయే పాడినారు.

ఏతద్వంశ్యులు ఇప్పుడు నెల్లూరుజిల్లాలో ముఖ్యముగా పాటూరు ఇందుకూరుపేట ఇత్యాదిగ్రామముల వర్ధిల్లుచున్నారు. పాటూర వారియింట సోమయాజులవారి గంటము నివసించినయొర దేవతార్చన పీఠములో పూజ నొందుచున్నది. గంటము మాత్రము లేదు. ఇతరహస్తంబునం బడ నొల్లక సోమయాజులవారితోనే స్వర్గమునకేఁగెంగావలయు.

## ౫౧. మనుమరాజువంశము.

సూర్యుఁడు.
|
...
|
శ్రీరాఘవుఁడు.
|
కరికాళుఁడు.
|
మనుమసిద్ధి.
|
(చోడ) తిక్కరాజు.
[ఇతనిమంత్రులు సిద్ధనకొమ్మనలు.]
|
మనుమసిద్ధి.
[ఇతనిమంత్రి తిక్కన సోమయాజి.]

## నెం. ౧. శ్రీ తిక్కన సోమయాజి వంశము.

గౌతమముని...[1] మారెన—(కొడుకు) [2] గుండన—(కొడుకు) [3] కేతన—(కొడుకులు)
[4] గుండన, [5] భాస్కరుఁడు, [6] మహేశ్వరుఁడు.

